# నర్తన బాల



డా॥ నటరాజ రామకృష్ణ





విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

ప్రచురణ నెం : 1629 ప్రతులు : 2

ప్రథమ ముద్రణ : 1957

ద్వితీయ ముద్రణ : జనవరి, 1992



టైటిల్ డిజైను : పవన్

లోపలి చిత్రాలు : బి. రామకృష్ణ

వెల : రూ 40.00

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
4-1-435, విజ్ఞాన భవన్, బ్యాంకుస్ట్రీట్,
హైదరాబాదు - 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్,
విజయవాడ, హైదరాబాదు, అనంతపురం, విశాఖపట్నం,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

ISBN : 81-7098-280-4

ముద్రణ : శ్రీ రాజరాజేశ్వరీ ప్రింటర్స్, తిలక్‌నగర్, హైద్రాబాదు.

# పీ ఠి క

బా ల లూ !

మీలో చాలామందికి నృత్యం (డాన్సు) అంటే ఎంతో యిష్టం. గ్రామఫోనులోగాని, రేడియోలోగాని మీకు ఏదేనా సినిమాపాట వినిపిస్తే అది విని చప్పున చేతులు త్రిప్పుకుంటూ నృత్యం ప్రారంభిస్తారు. పెద్దవాళ్లు సినిమాలలోనూ, స్టేజిమీద చేసే నృత్యాలనుచూచి ఆలాగే తిరిగి మీరుకూడా నృత్యం అనుకరిస్తున్నారు. మీలో చాలామందికి నృత్యం నేర్చుకోవాలని వుంది; కాని నేర్పేవారే అరుదు. ఒకవేళ ఎవరేనా నేర్పేవారు దొరికినా, వారు పెద్దవాళ్లకు నేర్పేవన్నీ మీకు నేర్పిస్తున్నారు. మీకు అర్థంకాని మాటలనూ, భావాలనూ మీచేత పలికించి, ఆడిస్తున్నారు.

అసలు నాట్యశాస్త్రం అంటే ఏమిటి? ఈ నాట్యశాస్త్రం ఎలా పుట్టింది? ఎన్నెన్ని రకాలుగా పెరిగింది? దాని కథ ఏమిటి? మీరు నేర్చుకోవలసిన తొలిపాఠాలు ఏమిటి? మీకోసం చాలామంది కథల పుస్తకాలూ, పాటల పుస్తకాలూ, గేయాలూ, గేయ కథలూ, నాటికలూ వ్రాసి ప్రచురించారు. కాని, నాట్యశాస్త్రంమీద ఎవరూ ఇంతవరకూ మీకోసం వ్రాయలేదు.

నాట్యశాస్త్రంమీద పుస్తకం వ్రాయడం సామాన్యమైన పనికాదు. దానికి నాట్యశాస్త్రంలో బాగా అనుభవం వుండాలి; బాలల మనస్తత్వం బాగా తెలియాలి; బాలల భాష తెలియాలి — ఇవన్నీ తెలిసినవారే యీ పుస్తకం వ్రాయగలరు. ఇవన్నీ తెలిసినవారు శ్రీ నటరాజ

రామకృష్ణగారు. వారి పేరు మీరు వినేవుంటారు. వారు మీ వూరికికూడా వచ్చివుంటారు. వారితో మీరు ఎప్పుడైనా మాట్లాడారా? నోరు విప్పకుండానే, కళ్లతోనూ, చేతులతోనూ వారు మీతో మాట్లాడగలరు. పెద్ద పెద్ద వేదికలమీద నాట్యశాస్త్రంమీద ఎంత బాగా ఉపన్యసించగలరో, అంత బాగా అందాల నర్తనబాలలతో ఆడుకోగలరు.

బా ల లూ !

రామకృష్ణగారు మీ కొరక అందాల బొమ్మల "నర్తనబాల" ను ఇచ్చారు. ఈ నర్తనబాలకి నాట్యశాస్త్రం గురించి ఎన్నో కథలు వచ్చును. చదవండి. ఈ నర్తనబాలకి రకరకాల నృత్యాలు వచ్చును. నేర్చుకోండి. నృత్యకథలను తెలిపే యీ నర్తనబాలను బాల ప్రపంచానికిచ్చి మార్గదర్శి అయిన శ్రీ నటరాజ రామకృష్ణగారికి జోతలు చెప్పండి.

ఈ పుస్తకం ఒక్క తెలుగు బాలలకే కాకుండా మన భారతదేశం లోని బాల లందరికీ పనికివస్తుంది. అంచేత ఈ పుస్తకాన్ని ఇతర భాషలలోకూడ వారు ప్రచురిస్తే బావుంటుంది కదూ?

మీ బాలన్నయ్య,

న్యా య ప తి రా ఘ వ రా వు.



# మ న వి

పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది. అలాగే కళలమీద ఆసక్తికూడా చిన్ననాడే కనిపిస్తుంది. చిన్నారి బాలలు ఏ పాటచెప్పినా చిట్టి చిట్టిచేతు లూపుతూ కనుబొమ లెగర వేస్తూ అభినయించనిదే వుండరు. ఆ లేత్రప్రాయంలోనే వారిలోని కళాబీజానికి తలిదండ్రులు దోహదంచేయాలి.

అందుకు సహజంగా ఆడనేర్చిన బాలల నాట్యోత్సు కతను క్రమబద్ధం చేయడం అవసరం. ఈ అవసరాన్ని తీర్చడానికి శ్రీ నటరాజ రామకృష్ణగారు ఈ గ్రంథాన్ని రచించారు.

తమ బిడ్డలలో కానవచ్చే నాట్యకళాసక్తిని పెంపొం దించగోరు తలిదండ్రులకు మే మీ పుస్తకాన్ని అందించ గలుగు తున్నందుకు సంతోషిస్తున్నాం.

బాలలకు ఈ పుస్తకంమీద మక్కువ కలిగించడం కోసం, నటరాజ రామకృష్ణగారి భావాలకు రూపకల్పనచేస్తూ అనేక చిత్రాలు రచించారు శ్రీ బి. రామకృష్ణగారు.

ఈ పుస్తక ప్రచురణావకాశాన్ని మాకు కలిగించిన శ్రీ నటరాజ రామకృష్ణగారికి, చిత్రకారులు శ్రీ బి. రామకృష్ణ గారికీ మా అభివందనాలు.

— ప్రచురణకర్తలు.



# ఒక్క చేమాట

చెల్లాయిలూ, తమ్ముళ్లూ!

ఈ చిన్ని పుస్తకంలో మీకు మన దేశంలోని రకరకాల నాట్యాలను గురించి చెప్తాను.

మన దేశంలో నివసించేవారు, ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క భాష మాట్లాడతారు. అలాగేవారు సంగీతాన్ని, నృత్యాన్నిగూడా వృద్ధిపరుచుకున్నారు. ఆ విధంగా వృద్ధిజెందిన నృత్యాలే!

ఆంధ్రదేశంలో 'ఆంధ్రనాట్యం' 'కూచిపూడి' నృత్యమని
అస్సాములో 'అంకియానట్' అని—
ఒరిస్సాలో 'ఒడిస్సీ' నృత్యమని—
తమిళ దేశంలో 'భరతనాట్య' మని—
మలయాళ దేశంలో 'కథకళి' యని—
మణిపుర ప్రాంతంలో 'మణిపుర' నృత్యమని—
ఉత్తర హిందూస్థానములో 'కథక్' నృత్యమని—
సిరైకేళా సంస్థానంలో 'చౌ' నృత్యమని — పిలువబడుతున్నాయి.

వీటిలో పురుషులు మాత్రమే చేసే నృత్యాలు కొన్ని వున్నాయి. కొన్ని నృత్యాలు స్త్రీలు మాత్రం చేస్తారు. కొన్నింటిలో యెక్కువమంది పాల్గొంటారు. మరి కొన్నింటిలో ఒక్కరు మాత్రం ఆడతారు. ఇన్ని విధాలైన నృత్యాలన్నింటిని గురించి ఈ పుస్తకంలో చదువుతారు. ఇందులోని ముద్దులొలికే చక్కని బొమ్మలు చిన్నన్నయ్య చిరంజీవి రామకృష్ణ వేశాడు. అతడు నా వద్ద నాట్యం అభ్యసిస్తున్నాడు.

అడిగినంతనే అంగీకరించి, కోరినవిధంగా ముచ్చటగొల్పే, ముద్దుల బాలగా నర్తనబాలను రూపొందించి బాల లోకానికి అందించిన విశాలాంధ్ర ప్రచురణాలయంవారికి, మనం ధన్యవాదా లర్పించాలి.

— నటరాజ రామకృష్ణ

# నృత్యాము పూజ - దేవదాసి

ప్రక్కనున్న బొమ్మ చూచారుగదూ! అది దేవాలయంలో నృత్యం చేస్తున్న ఒక అమ్మాయి చిత్రము.

ప్రస్తుత కాలంలో మనము ఆలయానికి వెళ్లితే పూజారి దేవుని పువ్వులు, పండ్లతో మాత్రం పూజజేసి, హారతి యివ్వడం చూస్తాము. పూర్వము అలాగ కాదు. ప్రతిదినము ప్రొద్దున్న భగవంతుని 'మేలుకొలుపు' మొదలు మరల రాత్రి 'పవళింపు' వరకూ అనేక సమయాల్లో సంగీతము పాడేవారు. నాట్యం జేసేవారు. ఉదయం సన్నాయి, డోలు వాయిద్యకులు మేల్కొలుపు పాటలు వాయించేవారు. స్త్రీలు చక్కని పాటలు పాడి స్వామిని నిద్ర లేపేవారు. మరల సాయంత్రం పూజ ముగియగానే స్వామిని సంతోషపెట్టడానికి సంగీతము పాడేవారు. వివిధ రకాల నృత్యాలు జేసేవారు. రాత్రి స్వామిని ఊయల్లో పండుకోబెట్టి వూపుతూ, 'ఏల' పాటలు — 'జోల' పాటలు పాడి నిద్ర బుచ్చేవారు.

దేవాలయాన్ని శుభ్రంగా వుంచడానికి, అందమైన ముగ్గులతో ఆలయ ప్రదేశాన్నంతా కనులపండువుగా అలంకరించడానికి, రంగురంగుల రకరకాల పువ్వులతో స్వామిని అలంకరించుటకు దండలు కట్టడానికి, దేవునికి కమ్మని సంగీతం వినిపించుటకూ, నృత్యంతో ఆనందపరుచుటకూ, ఈ పనులన్నీ చేయడానికి ఆలయాల్లో స్త్రీ లుండేవారు. వారు గొప్ప దైవభక్తి గలవారు. ఎప్పుడూ దేవుని సేవలో కాలం గడిపేవారు. వీరిని దేవదాసీ లంటారు. అంటే దేవుని సేవకు లన్నమాట.

దేవేంద్రునికి నృత్యము, సంగీతమంటే యెంతో ప్రీతి. అతని దర్బారులో యెందరో సంగీతము పాడెవారూ, నాట్యం జేసేవారూ వుండేవారు. వారిలో 'ఊర్వశి' అనే నర్తకి వుండేది. ఆమె సంతతివారె దేవదాసీలు. దేవుని నృత్యం, సంగీతములతో పూజించడమే వీరి ముఖ్య వృత్తి. వీరినే ఆంధ్రదేశం దేవనర్తకినులు అంటారు.

# ముగ్గురు మూర్తులు

" విష్ణు ఈశ్వర బ్రహ్మ ముగ్గురు అన్నదమ్ములంటా
వారి మహిమతో జేసిన నే నొక మట్టి బొమ్మనంటా "

బాలలూ!

మన భారతదేశం చాలా పురాతనదేశము; పుణ్యభూమి. ఎందరో దేవుళ్లు, ఋషులు, గొప్ప గొప్ప మహాత్ములు పుట్టిన ప్రదేశం. ఈ దేశంలోని ప్రజలు అనేకమంది దేవతల్ని పూజ చేస్తారు. అందరిలో విష్ణు, ఈశ్వర, బ్రహ్మ — ఈ ముగ్గురు మూర్తులు చాలా ముఖ్యమైనవారు. వీరినే త్రిమూర్తు లంటారు.

విష్ణుదేవుడు — వైకుంఠములో వుంటాడు.

ఈశ్వరుని నివాసం — కైలాసంలో.

బ్రహ్మదేవునిది — సత్యలోకం.

బ్రహ్మదేవుడు ఈ ప్రపంచాన్ని సృష్టి జేస్తాడు.

అన్ని విద్యలు, కళలు తెలిసిన గొప్ప దేవుడు. ప్రపంచములోని మానవు లందరి వుపయోగముకొఱకు 'నా ట్య వే ద ము' వ్రాశాడు. ఇతనికి నాలుగు ముఖము లుంటవి. కనుకనే చతుర్ముఖుడని గూడా పిలుస్తారు.

బ్రహ్మ సృష్టిజేసిన ప్రపంచాన్ని కాపాడే మహాపురుషుడు విష్ణువు. ఇతడు గొప్ప నాట్యం చేస్తాడు. ఇతనికి నాల్గు చేతు లుంటాయి. నాల్గు చేతుల్లో—శంఖము, చక్రము, గద, పద్మము పట్టుకొంటాడు. ప్రపంచాన్ని కాపాడాలి. కనుక అనేక అవతారాలు యెత్తాడు. అవే దశావతారములు. ఆ అవతారములను గురించి వేరుగా చెప్పాను.

ఈశ్వరుడు సృష్టిని అంతముజేసేవాడు. కనుకనే ఈతనిని రుద్రుడని గూడా అంటారు. ఈతనికి నొసట మూడో కన్నుగూడా వుంది.

అందుకే త్రినేత్రుడని గూడా భక్తులు పిలుస్తారు.

ఈ ముగ్గురు మూర్తులు బాగా నాట్యం తెలిసినవారు. వీరినిగూర్చి ముందు ముందు యింకా వివరంగా చెప్పుతాను.

# ముగ్గురుమూర్తుల దేవేరులు

లక్ష్మి - పార్వతి - సరస్వతి.

లక్ష్మీదేవి - మహావిష్ణు భార్య. బొమ్మలో తామరపువ్వు పట్టుకొనివుందే ఆమే లక్ష్మీదేవి. ఆమెను పూజచేస్తే మనము కోరినవన్నీ యిస్తుంది.

ఆమె ప్రక్కనున్న అమ్మయే పార్వతి. జగన్మాత. ఈశ్వరుని భార్య. ఈమె నాట్యంలో గొప్ప పండితురాలు.

చేతిలో వీణ పట్టుకొనివున్న దేవి - సరస్వతి. చదువుల తల్లి. ఈ అమ్మను భక్తితో పూజచేస్తే, అన్ని విద్యలు అబ్బుతాయి. వీణ వాయించడమంటే సరస్వతికి యెంతో యిష్టము. సంగీతములో గొప్ప విద్వాంసురాలు. ఈమె బ్రహ్మదేవుని భార్య.

# శివుడు, పార్వతి నాట్యంజేశారు

శివ పార్వతులే మన దేశములో శాస్త్రీయ నృత్యం వృద్ధిజేసిన దేవతా మూర్తులు.

వీరిని పురాణ దంపతులని భక్తులు పిలుస్తారు.

శివునికి—

ఉమాపతి, శంకర, మహాదేవ, పశుపతి, హర, దక్షిణామూర్తి, నటరాజు మొదలైన పేర్లు.

అలాగే పార్వతిని—

అంబ, ఉమ, గౌరి, కాత్యాయని, భైరవి, కాళి, త్రిపురసుందరి మొదలైన పేర్లతో పిలుస్తారు.

వారు హిమాలయ పర్వతాల్లో నివసించేవారు. నందివారి వాహనము, వినాయకుడు, కుమారస్వామి వారి పుత్రులు. ఎలుక వినాయకుని వాహనము, నెమలి కుమారస్వామి వాహనము.

శివుడు తాండవ నృత్యం జేసేవాడు.

తాండవ మంటే మగవారుజేసే గంభీర నృత్యము.

పార్వతి లాస్య నృత్యములో గొప్ప పండితురాలు.

లాస్య మంటే స్త్రీలు జేసే అందమైన నృత్యము.

ఈ రెండు పద్ధతుల నృత్యాలను ఉమా - మహేశ్వరులు భరతదేశంలో ప్రచారం జేశారు.

# సంధ్యాతాండవము

" అవధరింతువు ప్రతి దివసాంతమందు
నిత్య నూతన తాండవ నృత్యకేళి
ఓయి నటరాజ ! తలలైన నూపలేక
భువనములు దుర్భరానందమును నడంగ "

ప్రతిదినము సూర్యుడు అస్తమించే సమయంలో శివుడు నాట్యం జేసేవా
సాయంత్రంవేళ జేసే నాట్యానికి ' సంధ్యాతాండవ ' మని పేరు.

పార్వతి రత్నాలు తాపిన సింహాసనముమీద కూర్చొని , ఆ నృత్యాని
చూచేది.

దేవతలందరూ అక్కడ కూడేవారు.

బ్రహ్మ తాళము వేసేవాడు. విష్ణువు మృదంగం వాయించేవా
ఇంద్రుడు మురళి నూదేవాడు, సరస్వతి వీణ పలికించేది. లక్ష్మీదేవి పా
నారద, తుంబురులు వంత పాడేవారు. గంధర్వులు, యక్షులు, కిన్నెర
కింపురుషులు మొదలైనవారు ఆ నాట్యం జూచి తరించేవారు.



సంధ్యాతాండవము

# నాట్యవేదము

బ్రహ్మ 'నాట్య వేదము' వ్రాశాడు.

భారతీయులకు పవిత్రమైన గ్రంథాలు నాలుగు. వానికే వేదములని పేరు. అవే ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము. ఈ నాల్గు వేదములు అందరూ చదువుటకు, గానముచేయుటకు వీలుండేది గాదు. కనుక బ్రహ్మదేవుడు పూర్వకాలంలో ప్రపంచంలోని ప్రజలందరి ఉపయోగముకొఱకు ఒక క్రొత్త గ్రంథం వ్రాశాడు.

ఋగ్వేదమునుండి — వాయిద్యాలను వాయించే విధమును,

యజుర్వేదమునుండి — రకరకాలుగా శరీరముయొక్క కదలికద్వారా మాటలకు అర్థముచెప్పే విధమును,

సామవేదమునుండి — తియ్యగాపాడే పద్ధతిని,

అధర్వణవేదమునుండి — అనేక విధాలుగా భావాలు: అంటే దుఃఖము, సంతోషము, కోపము, భయము మొదలైనవానిని ప్రదర్శించే తీరులు.

వీటి నన్నిటిని పైన జెప్పిన నాల్గు వేదములనుండి గ్రహించి ఒక క్రొత్త గ్రంథం వ్రాశాడు. అదే నాట్యవేదము. నాల్గు వేదాల సారమే నాట్యశాస్త్రము. గనుకనే భారతీయులు నృత్యాన్ని చాలా పవిత్రంగా చూస్తారు.

# లక్ష్మీదేవి నాట్యమాడినది

పూర్వం దేవతలు, రాక్షసులు అమృతము కొఱకు పాల సముద్రము తరిచారు.

మందరగిరిని కవ్వముగానూ, వాసుకి సర్పము త్రాడుగానూ ఉపయోగించారు. అప్పుడు లక్ష్మి పాలసముద్రములో పుట్టినది. ఆమె ఆనందంతో నాట్యమాడినది.

# విష్ణు నాట్యం చేశాడు

సముద్రము చిలకగా చిలకగా అమృతము పుట్టింది. ఆ అమృతంకొఱకు దేవతలు, రాక్షసులు తగువులాడుకున్నారు. వారి తగువుతీర్చాలి. అమృతము పంచిపెట్టాలి. అందుకు శ్రీ మహావిష్ణువు పూనుకొన్నాడు. మోహినీ రూపము ధరించి, నృత్యము చేశాడు.

# నృత్యా పూజ

చాలా చాలా కాలం క్రిందట మన పూర్వులు పంచభూతముల... పూజించేవారు.

అప్పుడు హోమము చేసేవారు. సంస్కృతములో ఆ దేవతలను ప్రార్థ జేసేవారు.

తరువాత స్తోత్రముజేస్తూ వారిని సంతోషపెట్టుటకు పాటలు పాడుతూ నాట్యం జేసేవారు. ఆ కాలానికే వేదయుగమని పేరు.

ఆ కాలంలో ఋషులు వ్రాసిన మహా గ్రంథాలే - ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము - అనే నాలుగు వేదాలు.

ఇవి భారతీయులకు చాలా పవిత్రమైన గ్రంథములు.

ఇవి సంస్కృతములో వున్నవి.

సంస్కృతము 'వేదభాష' యని మరియొక పేరుతో గూడా పిలువ డుతు

## “కాళీయ మడుగులో తాండవకృష్ణుడు అడుగో అడుగో అడుగడుగో”

వ్రేపల్లెకు దగ్గరలో ఒక మడుగు వుండేది. అందులో కాళీయుడనే క్రూర సర్పరాజు వుండేవాడు. ప్రజలను అనేక విధాలుగా బాధ పెట్టేవాడు. చిన్నికృష్ణుడు ఆ పాము పొగరు అణిచి అతని తలపై నిల్చి చిత్ర విచిత్రంగా నృత్యం చేశాడు.

# కృష్ణుడు మురళి నూదితే గోపికలు నృత్యం జేశారు

కృష్ణుడు దేవకీ వసుదేవుల కుమారుడు. చిన్న తనంలో వ్రేపల్లెలో నందుని యింటిలో పెరిగాడు. బాల్యంలోనే మురళి చక్కగా నూదేవాడు.

ఆ వేణునాదం ఎంత తియ్యగా ఉండేదంటే వ్రేపల్లెలో వున్నవారు - స్త్రీలు, పురుషులు - తమ శరీరాల్ని మరిచి ఆనందంతో నృత్యం జేసేవారు. అలా చేసే నాట్యానికే 'రాసలీల' అని పేరు.

# హో హో - హూ హూ

హాహా హూహూ లు అన్నదమ్ములు. గంధర్వులు. వారు సత్యలోకంలో బ్రహ్మదేవుని వద్ద నాట్యం జేసేవారు.

బ్రహ్మదేవుడు సృష్టికర్త. అంటే ఈ ప్రపంచాన్ని సృష్టించినవాడు. అతడు నాట్యాన్నిగూర్చి గొప్ప గ్రంథం వ్రాశాడని యిదివరకే జెప్పానుగదూ. బ్రహ్మ అర్ధాంగి సరస్వతి. ఆమె చదువుల తల్లి. అందుకే మనం చదువు బాగా రావాలని ఆ అమ్మను పూజిస్తాము. ఆమె వీణా వాద్యంలో గొప్ప పండితురాలు. గనుకనే మన చిత్రకారులు యెప్పుడూ ఆమెను వీణ వాయిస్తున్నట్లు చిత్రిస్తారు. అట్టి పూజ్యదంపతులు, గొప్ప విద్వాంసులైనవారి సత్యలోకంలో నాట్యంజేసే హాహా హూహూ లు యెంతగొప్ప కళాకారులై యుంటారో వేరే చెప్పాలా ?

# బ్రహ్మ భరతునికి నాట్యం నేర్పాడు

భరతుడు గొప్ప ఋషి. బ్రహ్మదేవుని వద్ద చక్కగా నాట్యం నేర్చుకొని, తనుగూడా నాట్యంపై ఒక గ్రంథము వ్రాశాడు. అదే మన దేశంలో యీ నాటికీ గూడా ప్రచారంలో వుంది. ఇది చాలా ముఖ్య మైన గ్రంథము. ఈ గ్రంథము పేరు నాట్యశాస్త్రము. నాట్యకళను గూర్చిన సమస్త విషయాలు యిందులో వివరంగా చర్చించ బడ్డాయి.

# కైలాసంలో భరతుని నాట్య ప్రదర్శనం

భరతుడు తన శిష్యులతో కైలాసం వెళ్ళి శివ పార్వ తుల ముందు నాట్యం ప్రదర్శించాడు. శివుడు చాలా సంతోషించాడు.

తన సేవకుల్లో ఒకడైన తండుని చేత భరతునికి తాండవము చెప్పించినాడు.

# అర్జునుడు ఉత్తరకు నాట్యం నేర్పాడు

ధృతరాష్ట్రుడు, పాండురాజు అన్నదమ్ములు.

దుర్యోధనుడు, దుశ్శాసనుడు మొదలైనవారు ధృతరాష్ట్రుని కుమారు.. వీరే కౌరవులు.

ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు - పాండు..జు కుమారులు. వీరే పంచపాండవులు.

జూదంలో ఓడిపోయిన పాండవులు పదమూడేళ్ళు వనవాసం చే...

తమరాజ్యాన్ని కౌరవులకు అప్పగించి పన్నెండు సంవత్..లు అరణ్యంలోనూ, ఒక సంవత్సరము అజ్ఞాతంగానూ గడపాలి. అది వారి నియమం.

ఎవరూ గుర్తు పట్టకుండా వుండే విధంగా మారువేషాలు వేసు..ని జీవించుట, అజ్ఞాతవాసము.

పాండవులు విరాటరాజు కొలువులో ఒక సంవత్సరం అజ్ఞా..గా గడిపారు.

అర్జునుడు బృహన్నల అనే మారుపేరుతో విరాటరాజు ... ఉ... నాట... ...ప్పాడు.

...విద్యల గొప్ప వీరుడేగాక సంగీతము, నాట్యము

లలి ...దా...

# పార్వతి, ఉషకు నాట్యం నేర్పింది

ఉష బాణాసురుని కుమార్తె.

బాణాసురుడు గొప్ప శివభక్తుడు.

అతడు యెన్నో సంవత్సరాలు శివుని అనుగ్రహము సంపాదించ గొప్ప తపస్సు చేశాడు.

శివుడు అతని తపస్సుకు మెచ్చి - 'ఏమి వరము కావాలో కోరుకొ మన్నాడు.

పరమశివుడు యెప్పుడూ తనవద్దనే వుండేటట్లు వరమిమ్మని సురుడు ప్రార్థించాడు.

శివుడు అతని ప్రార్థనను మన్నించి: తన అర్ధాంగి పార్వతితో క బాణాసురుని మందిరంలో నివసించాడు. ఉష గుణవతి. గొప్పభక్తు శివపార్వతులకు అనేక విధములుగా సేవజేసి వారిని సంతోష పెటి పార్వతి ఉష భక్తికి మెచ్చి, తనకు తెలిసిన లాస్య నృత్యం ఉషకు నేర్పింది.

# ఉష ద్వారకలోని రాజకన్యలకు నాట్యం నేర్పిం..

ఉష పార్వతివద్ద నాట్యం అభ్యసించిందని చెప్పాను గదూ. _ చాలా కొద్ది కాలంలో గొప్ప నర్తకి అయింది. నాట్యం చేయడమే గా... నాట్యకళమీద ఒక గొప్ప గ్రంథం వ్రాసింది. ఆ గ్రంథముపేరు 'ఉషా భరతము'. ఆమెను శ్రీకృష్ణుని మనుమడు అనిరుద్ధుడు వివాహము ... కున్నాడు. పెండ్లి అయిన తరువాత భర్తతో కలిసి అత్తవారింటికి ద్వా... వెళ్ళింది. అప్పుడు ద్వారకలోని యితర రాజకన్యలకు నాట్యం నేర్పింది. ... శాస్త్రీయ నాట్యకళ ప్రపంచంలోకి వచ్చిందని పెద్దలు చెప్పుతారు.

# ఇంద్రుని దర్బారులో నాట్యం

ఇంద్రునికి నృత్యం, సంగీతం అంటే యెంతో ప్రీతి.

ఇంద్రసభలో నాట్యంజేసే ప్రముఖ నర్తకీసులు.

రంభా, ఊర్వశి, మేనక.

బ్రహ్మదేవుడు, భరతుడు గాక నందికేశ్వరుడు అను మరొక గొప్ప నాట్యకళావేత్త 'భరతార్ణవ'మనే పేరుతో నాట్యానికి సంబంధించిన ఒక గ్రంథం వ్రాశాడు. అదిగూడా చాలా పెద్ద గ్రంథము. అంత పెద్ద గ్రంథం అందరూ చదివి అభ్యాసం చేయడానికి వీలుండేదిగాదు. గనుక ఇంద్రుడు, అందరూ సులభంగా చదువుకోడానికి ఉపయోగపడేటట్లు ఒక చిన్న గ్రంథం వ్రాయమని నందికేశ్వరుని కోరాడు. ఇంద్రుని కోర్కె మన్నించి భరతార్ణవాన్ని సంక్షిప్తపరిచి 'అభినయ దర్పణం' అనే గ్రంథం వ్రాశాడు. అది చాలా చిన్న గ్రంథం. చాలా ఉపయోగమైంది. ప్రస్తుతం భారతదేశంలో నాట్యం జేసే వారందరూ ఆ గ్రంథాన్నే పఠిస్తారు.

# దేవాలయ గోడల మీద బొమ్మలు నాట్యం చేస్తాయి

పూర్వకాలంలో మన దేవాలయాలు కట్టిన శిల్పులు అన్ని శాస్త్రాలు బాగా చదివినవారు. వారికి సంగీతము, నృత్యము గూడా చక్కగా తెలియును. వారు ఆలయం గోడలమీద అందమైన బొమ్మలు చెక్కారు.

ఆ బొమ్మల్లో కొన్ని నాట్యం జేస్తుంటాయి.
కొన్ని పాడుతాయి.
కొన్ని వాయిద్యాలు వాయిస్తాయి.

ఆ చక్కని శిల్పాలే నేటి కాలములో మనకు పూర్వపు నృత్యము గురించి తెలుసుకోడానికి యెంతగానో వుపయోగ పడుతున్నాయి.

# ఆలయాలు సరస్వతీ నిలయాలు

పూర్వము ఆలయాలే మన విద్యాలయాలు. అక్కడ పండితులు సంస్కృతం, సంగీతం, నాట్యం, చిత్రలేఖనం (బొమ్మలు వ్రాయుట), శిల్పం (బొమ్మలు చెక్కుట) నేర్పేవారు.

నమస్కార హస్తము —:

రెండుచేతుల అరచేతులు ఒకదానితో ఒకటి తగిలేటట్లు పట్టితే నమస్కార హస్తము (అంజలి) అవుతుంది.

1. దేవతలకు నమస్కారము చేయుటకు చేతులు తలపైనుంచాలి.
2. విద్య చెప్పే గురువుకు నమస్కారము జేసేటప్పుడు చేతులు ముఖానికి యెదురుగా పెట్టాలి.
3. పెద్దలకు నమస్కరించు నప్పుడు గుండె కెదురుగా చేతుల నుంచవలెను.

# వాయిద్యాలు

చర్మ వాయిద్యా లన్నింటిలో మొదటిది శంకరుని చేతిలోని 'డమరు'.

ఆ డమరును మధ్యలో రెండుగాచేసి త్రిప్పి అతికితే మృదంగ మయింది.

ఆ మృదంగమును మరల రెండుగా చేసి 5-వ బొమ్మలో లాగున వుంచితే తబలా అయింది.

6 - బొమ్మ నగారా.

7 - జల తరంగము — ; గిన్నెల్లోగాని, కప్పుల్లో గాని నీరుపోసి చిన్న పుల్లలతో వాయించే వాయిద్యానికి జల తరంగము అని పేరు.

# నాట్యానికి కావలసిన వాయిద్యాలు

1. గజ్జెలు - గజ్జెలు కాళ్ళకు కట్టుకొని నాట్యమాడే టప్పుడు భూమిమీద తట్టుతూ పలికిస్తారు.

2. కంచు తాళాలు - నాట్యంలో పాటకు తగినట్టుగా తాళాలు ఆడి గురువు తట్టుతాడు. నర్తకి ఆ శబ్దాలకు తగినట్టుగా ఆడుతుంది.

3. మురళి - నృత్యములోని వాయిద్యాలలో మురళిగూడా ఒక ముఖ్య వాయిద్యము. పూర్వము శ్రీకృష్ణుడు ఈ వేణువుమీద తియ్యని పాటలుపాడి వ్రేపల్లెలోని వారందరినీ సంతోషపెట్టాడు.

4. వీణ - నాట్యానికి వీణగూడా ముఖ్యమైన వాయిద్యం. పురాతనకాలంలో సరస్వతీదేవి (చదువుల తల్లి) వీణ వాయించేవారు.

5. తంబుర - సంగీతము పాడే టప్పుడు తంబుర నాదంలో కంఠం చే పాడుతారు.

# మారేడు పత్రి

అమ్మ ఆలయానికి వెళ్ళేటప్పుడు మారేడు ఆకులు తీసుకుని వెళ్తారు. ఈ ఆకుల గురించి కొంచెము చెప్తాను. మారేడు పండ్లు, మారేడు పత్రి అంటే శివునికి యెంతో ప్రీతి. దీనినే బిల్వపత్రి అనిగూడా అంటారు.

ఇవి మూడేసి ఆకులుగల చిన్నరెమ్మలుగా పెరుగుతాయి. ఈ పత్రితో పూజచేస్తే శివుడు కోరిన వరాలు యిస్తాడని భక్తులు నమ్ముతారు.

మరొక తమాషా అయిన సంగతి చూడండి —

శివునికి — నేత్రాలు మూడు — త్రినేత్రుడు

శివునికి — ఆయుధం — త్రిశూలం

శివునికి — ఇష్టమైన పత్రి — త్రిపత్రము
బిల్వపత్రి

# తులసి మహిమ

విష్ణువునకు ప్రీతికరమైంది తులసి. విష్ణు ఆలయాల్లోకి వెళ్ళితే తు... ఆకు వేసిన తీర్థము మనకు యిస్తారు. పెరట్లో తులసికోటలోని తులసిచెట్టును ప్రతిరోజూ తెల్లవారేవేళ అమ్మ పూజచేయడం పిల్లలందరూ చూచే వుంటారు.

తులసికి పూజచేస్తే విష్ణుదేవుడు యెంతో సంతోషిస్తాడు. అందుకే యింట్లో పెద్దవారు తులసికి పూజచేస్తారు.

# పారిజాత పుష్పము

పారిజాత పువ్వు శ్రీకృష్ణునియొక్క జీవితచరిత్రలో ముఖ్యమైంది. ఈ పువ్వుకు సంబంధించిన కథయే పారిజాత నాటకముగా యోగి సిద్ధేంద్రుడువ్రాసి కూచిపూడి వారికి నేర్పించారు.

పారిజాత నాటకము కథ యేమిటంటే —

శ్రీ ... ని భార్యలందరిలోనూ రుక్మిణి పెద్దది. సత్యభామ ముద్దుల భార్య. ఒ... జున నారదుడు దేవలోకంనుండి ఒక పారిజాత పువ్వునుదెచ్చి కృష్ణ భగవానుల కిస్తాడు. అతడు ఆ పువ్వును రుక్మిణి కిస్తాడు. అది ...లిసి కొని సత... అలుగుతుంది. శ్రీకృష్ణుడు దేవలోకంనుండి పారిజాత చెట్టును తెచ్చి సత... టిలో నాటి ఆమె అలుక తీరుస్తాడు.

...యోగి ముచ్చటైన నాటకంగా వ్రాశాడు.

## నెమలి నాట్యమాడుతుంది

వర్షాకాలంలో ఆకాశమంతా నల్లని మేఘాలతో కప్పబడి వుంటుంది. మేఘాలు భయంకరంగా 'ఫళ ఫళ ఫళ' మని ఉరుముతాయి. మధ్య మధ్య 'ధళ ధళ'మని మెఱుపులు మెఱుస్తాయి. ఆ సమయంలో ఆనందాన్ని పట్టలేక నెమళ్లు తమ రంగురంగుల పురులు విప్పి నాట్యం చేస్తాయి. నెమలి నెలతలు చూచి ఆనందిస్తాయి.

## హంస నృత్యం చేస్తుంది

మెల్ల మెల్లగా అడుగులో అడుగు వేస్తూ హంసవయ్యారంగా నడుస్తుంది. అప్పుడు మనం చూస్తే అది అందంగా నృత్యమాడుతుందనిపిస్తుంది.

## కోయిల తియ్యగా పాడుతుంది

మనకు సంవత్సరానికి ఋతువులు ఆరు. అందులో వసంతము ఒకటి. ఇది చాలా సంతోషమైన కాలము. ఎక్కడ చూచినా చెట్లు చిగిర్చి, పచ్చ పచ్చని ఆకులతో, రంగురంగుల పువ్వులతో, కమ్మ కమ్మని వాసనలతో నిండి వుంటాయి.

అప్పుడు మామిడిచెట్లుగూడా యెక్కువగా పువ్వులు, కాయలతో మనకు చూడ్డానికి ఆనందం కలిగిస్తూంటాయి. మామిడి పువ్వుల్ని, పువ్వుల్లోని తేనెను, లేత చిగుళ్ళను కడుపునిండా విందారగించి, మత్తెక్కిన కోకిలమ్మ తియ్యగా కూస్తుంది. ఆపాట హాయిగా వుంటుంది.

# పతాకము (జండా)

అన్నివేళ్లూ చేర్చి వుంచితే పతాక మవుతుంది.
ఈ చేతితో మన జాతీయజండా చూపవచ్చును.

" ఎత్తవోయి జండా । ఎగరెయి జండా
మూడు రంగుల కాంతి । వాడవాడల నిండా "

# చిలుక

వేళ్లని రెండో బొమ్మలోలాగ పట్టితే చిలు కవుతుంది.

"పచ్చపచ్చని పండ్లు । పగడాల ముక్కుతో
పట్టి వొల్చితింటూ । పలుకాడనే లేవు
జామిచెట్టుమీద । ఓ చిలుకా
ఏమి కులుకే నీకు । రామచిలుక."

# పాము

చేతి వేళ్లన్నీ చేర్చి దొన్నెలా పట్టితే పాము.

"నాగుల చవితికి । నాగేంద్ర నీకు
పొట్టనిండా పాలు । పోసేము తండ్రి !"

# ము కు ళ ము - మొ గ్గ

వేళ్లన్నీ చేర్చి పట్టితే మొగ్గ అవుతుంది.

ఈ బొమ్మలోలాగ విప్పితే పువ్వు అవుతుంది.

పువ్వులో తేనె త్రాగడానికి వస్తోంది భ్రమరము.

## అర్ధపతాకము - (కత్తి)

చిటికెన వ్రేలు, ఉంగరము వ్రేలు వంచి మిగిలిన వ్రేళ్లన్నీ చాచిన కత్తిని చూపవచ్చును.

## త్రిశూలము

శంకరునియొక్క ఆయుధము.

చిటికెన వ్రేలు, బొటన వ్రేలు చేర్చి మిగిలిన వ్రేళ్లు విప్పితే త్రిశూల మవుతుంది.

## సూచి

అన్ని వ్రేళ్లూ ముడిచి చూపుడువేలు తెరవాలి.

నీవు, ఒకటిని సూచిస్తుంది.

# పులి

## శిఖరము - కొండశిఖరము

ద్వారపాలనము । మనకై జేయుచు
దేశరక్షణము । మనకై జేయుచు
శిఖరాగ్రమున । గగనము నంటే
అత్యున్నతగిరి । హిమాద్రి మనదే !

## చేప

చేయిమీద రెండవ చేతినుండి బొటనవ్రేళ్లు చాచిన చేప అవుతుంది.

## చంద్రకళ - చంద్రుడు

వెండికొండను బుట్టి । వెలుగును మాకిస్తూ
పదికోట్ల చుక్కలతో । పదిలముగ పెరిగేవు
చక్రరూపము నీదె । చందమామా
చీకటికి యముడ వోయి । చందమామా :

## కుండ

కుండను చూపుటకు రెండు చేతులను బొమ్మలో లాగున తలమీద పెట్టాలి.

"నీళ్లు తేబోతుంటె । నీ తోడెవో లమ్మ
నావెనుక యెవరోను । నవ్వినట్టుంటాది"

## అంజలి

రెండు చేతులు ప్రక్క-ప్రక్కగావుంచి పట్టితే అంజలి హస్త మవుతుంది. దేవునికి పువ్వులను సమర్పించుటకు ఉపయోగపడుతుంది.

# ఆవు

వ్రేళ్ళని బొమ్మలోలాగ పట్టితే ఆవు అవుతుంది.
ఆవు - దాని కొమ్ములు - ముఖము.

"గోవు మా లచ్చిమికి కోటి దణ్ణాలు."

# లేడి

నీళ్లు త్రాగుతూంది.

"లేతగడ్డి చిగుళ్ల మేసవి
చెట్లనీడల నిద్రపోయే
లేడిపిల్ల లేచి యిటు రావే"

ఏనుగు, తొండము, దంతములు.

మంచము

దోమతెర కట్టిన మంచము

కత్తెర

గరుడపక్షి

మహావిష్ణు వాహనము

# నిశుంభిత

ఒకరోజు ఉమా శంకరులు తగువులాడుతున్నారు.

ఎందుకు ?

పార్వతి తను బాగా నాట్యం చేయగలనని పలికింది.

శివుడు తనే గొప్ప నర్తకుడ నన్నాడు.

ఈ తగువు దీర్చడానికి కైలాసపర్వతముమీద దేవతలందరూ చేరారు.

ఇద్దరూ నాట్యం మొదలుపెట్టారు.

ఈశ్వరుడు ఒక కాలునెత్తి తలపైనుంచి నృత్యం జేశాడు.

అంబ అలాగ చేయనోల్లక నాట్యం మాసింది.

శివుడే గెలిచాడు.

**ఈ భంగిమ పేరు 'నిశుంబిత'.**

ఇది శివునికి చాలా యిష్టమైనది.

# భుజంగత్రాస

దేవాలయాల్లో దేవదాసీలు భగవంతుని సంతోషపెట్టుటకు నాట్యం చేస్తారని చెప్పానుగదూ?

వీరు రకరకాల నాట్యాలు జేస్తారు.

శివాలయాల్లో ఒక మాదిరిగా, విష్ణు ఆలయాల్లో మరొక మాదిరిగా, అమ్మవారు (పార్వతి) ముందు యింకొక మాదిరిగా, వేరువేరు దేవతలముందు, ఆయా దేవతలకు ప్రీతిగల్గించు నాట్యాలు చేస్తారు.

ఇవన్నీ పూజానృత్యాలు.

అంటే భక్తితో చేయబడుతవి.

సాయంత్రం పూజ ముగియగానే కొన్ని నాట్యాలు జేస్తారు.

స్వామిని రాత్రి నిద్రబుచ్చేటప్పుడు సంగీతముపాడి, నృత్యమాడి సంతోషపెట్టి పవ్వళింపుసేవ ముగిస్తారు.

అలాంటి నాట్యాల్లో 'భుజంగత్రాస' ఒకటి.

ఇది శివాలయాల్లో చేసే నాట్యం. సాయంత్ర సమయంలో ఆలయంలో ఈ నాట్యం చేస్తే శివుడు చాలా సంతోషిస్తాడు.

# తలపుష్పపుట

ఈశ్వరుడు చాలా గొప్ప నాట్యాచార్యుడని చెప్పాను. జ్ఞాపకముంది గదూ! అతడు తాండవనృత్య మాడేవాడు.

అలా ఆడినప్పుడు అనేక భావాలు ప్రదర్శిస్తూ, అనేక విధములైన భంగిమలు ప్రదర్శించాడు.

ఆ భంగిమలు మొత్తం 108.

వీటినే 'కరణములు' అంటారు.

ఈ కరణములు నాట్యంలో చాలా ముఖ్యము గనుక శాస్త్రీయనాట్యం చేసే ప్రతి ఒక్కరూ వీటిని తప్పక అభ్యాసం చేయాలి.

అందులో మొదటిది 'తలపుష్పపుట'.

ఈ భంగిమ భక్తితో దేవతలపై పువ్వులువేసే టప్పుడు ఉపయోగిస్తాము.

ఈ భంగిమతో ప్రారంభమయ్యే నృత్యం అంబముందు ప్రదర్శిస్తే ఆమె చాలా ఆనందిస్తుంది.

రెండుచేతులు దగ్గరగాచేర్చి పట్టి, దోసిట్లో పువ్వులు పట్టుకొని, దేవిని ప్రార్థిస్తూ శ్లోకాలు చదివి, ఆమెకా పుష్పాలు సమర్పించి, తరువాత నాట్యం చేస్తారు.

# కాళిదాసు

మహాకవి కాళిదాసు సంస్కృతములో అనేక నాటకాలు, కావ్యాలు వ్రాశాడు. ఇతడు విక్రమాదిత్యుని ఆస్థానంలో రెండువేల సంవత్సరాల క్రిందట వున్నాడు. విక్రమాదిత్యుని ఆస్థానములో తొమ్మిదిమంది ప్రఖ్యాత పండితు లుండేవారు. వారినే నవరత్నము లనేవారు. వారిలో ముఖ్యుడు కాళిదాసు.

కాళిదాసు అనేక నాటకాలు, కావ్యాలు వ్రాశాడన్నానుగదూ. అందులో 'శకుంతల' నాటకం ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన నాటకం. నాట్యకళయొక్క అనేక వర్ణనలతో గూడిన నాటకములు విక్రమోర్వశీయము, మాళవిక అగ్నిమిత్ర. మాళవిక అగ్నిమిత్ర నాటకంలోని కథానాయిక మాళవిక. ఆమె చక్కగా నాట్యమునేర్చిన విద్వాంసురాలు. రాజుగారి నాట్యమందిరంలో 'ఛవిక నృత్యం' చేసి రాజును మెప్పించుతుంది. రాజు ఆమె విద్యకు మెచ్చి ఆమెను వివాహం చేసుకుంటాడు.

బొమ్మలో కథ :—

కాళిదాసు 'మాళవిక' నాటకం వ్రాస్తున్నాడు. అప్పుడు 'మాళవిక' అతని కనులముందు అనేకవిధాల నాట్యమాడుతూ ప్రత్యక్షమవుతుంది. ఆ దృశ్యాలను జూచి అతడు ఆమె నాట్యాన్ని వర్ణిస్తాడు. అదే 'మాళవిక అగ్నిమిత్ర' అనే గొప్ప నాటకమైనది.

# శిలప్పాదికారము

తమిళదేశములో ప్రచారములో నున్న నృత్యమును గూర్చి అనేక విషయాలు తెల్పే చాలా పురాతన గ్రంథము 'శిలప్పాదికారం' సుమారు రెండు వేల సంవత్సరాల క్రిందట ద్రవిడదేశంలో (తమిళ దేశం) ఆరాధించబడిన నృత్యాలు యిందులో చక్కగా వర్ణించబడ్డాయి.

నర్తకులు సభల్లో యెలా నాట్యం చేయాలి, ఆచార్యుడు నాట్యం యెలా నేర్పాలి, నాట్యంలో యెలా పాడాలి, యెలా నర్తకిని ఆడించాలి, దేవాలయాల్లో నాట్యమాడే విధము, రాజసభల్లో నాట్యముజేసే తీరులు, అన్నీ ముచ్చటగొల్పేలా వర్ణించబడ్డాయి.

ఆ వివరాలన్నీ ఒక ముద్దులొలికే భాషలో ఒక కథారూపంలో చెప్ప బడింది. అదే 'ఆరంగేత్రిల్' కథ. మాధవి అనే రాజనర్తకి నాట్యంలో, సంగీత ములో, వీణావాద్యంలో గురువులవద్ద శిక్షణ పొందుతుంది. ఆ శిక్షణ క్రమమే పూర్వము తమిళదేశంలో వున్నది. మాధవి కథ చదివితే ఆనాటి నాట్యం గూర్చి తెలిసికోవచ్చును.

చిత్రంలో బొమ్మ :—

'మాధవి' నాట్యసభ జేసి మేనాలో గూర్చొని యింటికేగుచున్నది.

# దేవనర్తకి కళ్యాణి

తంజావూరు చాలా ప్రఖ్యాతి చెందిన పట్టణం. ఎన్నో చక్కని ఆలయాలు, మేడలు, రాజుల కోటలు అక్కడ ఉన్నాయి. అక్కడ సంగీతము, నాట్యం చాలా వృద్ధి చెందింది. ప్రస్తుతం 'భరతనాట్యం' అని ప్రచారంలో వున్న నాట్యాన్ని 'తంజావూరు భరతం' అని గూడా పిలిచేవారు. అక్కడి బృహదీశ్వ రాలయం చాలా పేరు గాంచింది. ఆ దేవాలయ నిర్మాణం గూర్చి ఒక కథ వుంది! ఆ గుడిని రాజరాజ చోళుడు కట్టించాడు. అంత పెద్ద, సుందరవంతమైన ఆలయం కట్టడానికి ఒక దేవదాసి కారణమట. ఆమె పేరు కళ్యాణి. ఆమె తండ్రి గోవిందాచారి. గొప్ప శిల్పి. తల్లి చిన్నప్పుడే చనిపోయింది. కళ్యాణికి నాట్యం నేర్పించి, ఆమెను దేవదాసీ చేయాలని గోవిందాచారి ఆశించాడు. రాజరాజు మారువేషంలో సంచారం చేస్తూ ఒక రోజున వారున్న పల్లెకు వెళ్లాడు. గోవిందాచారిని, కళ్యాణిని కలుసుకొన్నాడు. కళ్యాణి నాట్యం చూడాలని కోరాడు. ఆచారి ఆమె దేవదాసీ అవుతుందని, దేవుని ముందు తప్ప, మానవుల ముందు నాట్యమాడదని మనవి జేశాడు. రాజు అప్పుడు తంజావూరులో బృహదేశ్వ రాలయం కట్టించాడు. ఆలయంలో దేవుని ప్రతిష్ట జరిగిన రోజున కళ్యాణి మొదటిసారిగా నాట్యమాడింది. రాజు ఆమె నాట్యం జూచి తరించాడు. నాటి నుండీ ఆమె జీవితాంతం వరకూ ఆ దేవుణ్ణి పూజచేస్తూ జీవితం గడిపి భగవంతునిలో కలిసిపోయింది. కళ్యాణి పవిత్రాశయమే తంజావూరులోని ప్రసిద్ధ ఆలయం కట్టడానికి కారణమైంది; ఆమెపేరు శాశ్వతంగా దేశ చరిత్రలో నిలిచి పోయింది.

# సంగీతరత్నాకరము

ఈ గ్రంథమును సంస్కృతములో సాంగదేవ లేక సారంగదేవుడు రచించాడు. ఇతడు కాశ్మీర్ దేశానికి జెందిన పండితుడు. దేవగిరిని, సింగన ప్రభువు పాలించినప్పుడు (1210-1247) అతని ఆస్థానానికి వచ్చాడు. ఆ దేవ గిరినే ప్రస్తుతం దౌలతాబాద్ అంటారు. దౌలతాబాద్ ఔరంగాబాదుకు చాలా సమీపంలో వుంది. ఔరంగాబాదుకు దగ్గరలోనే అజంతా, ఎల్లోరా గుహలున్నవి. ప్రపంచంలో కల్లా ప్రఖ్యాతి గాంచిన చిత్రకళ అజంతాగుహల్లో వుంది. ఆ చిత్ర ములు ఎన్నో వందల సంవత్సరాల క్రింద చిత్రించబడినా, నేటికీ చెక్కు చెదర కుండా చక్కగా అందాలు చిందుతూ ఆనందం గొల్పుతూ వుంటాయి. అవి బుద్ధ దేవుని జీవిత కథలకు సంబంధించినట్టివి. ఎల్లోరా గుహలు శిల్పానికి ప్రసిద్ధి జెందినట్టివి. ఇందులో పరమ శివుని నృత్యానికి జెందిన భంగిమలు చాలా వున్నాయి. అవి నృత్యమాడేవారికి యెంతగానో వుపయోగపడతాయి.

సాంగదేవుడు ఉత్తర దేశంనుండి వచ్చుటచే ఆ దేశంలోని సంగీతమును చక్క[illegible] తెలిసి కొన్నాడు. దక్షిణదేశంలోని సంగీతమును గూడా చక్కగా దెలిసి[illegible]ని [illegible] ఈ రెండు పద్ధతుల సంగీత నాట్యముల మేళవించి 'సంగీత రత్నాం[illegible] [illegible]గించెను. ఈ గ్రంథము నర్తకులకు యెంతో ఉపయోగపడు తుంది [illegible] శాస్త్రము తరువాత అంతటి గొప్ప గ్రంథము 'సంగీత రత్నాం[illegible] ఒ[illegible] మాత్రమే. దీన్ని మించిన నాట్య గ్రంథము రచించిన వారు మ[illegible]క్కరు [illegible]పరకూ లేరు.

# నృత్తము

ఒక రోజు సాయంత్రం నాన్నగారితో మన యింటిదగ్గరలో నున్న త్యాగరా గానసభలో నాట్య ప్రదర్శనం చూడ్డానికి వెళ్తాము. హాలులో అందరం కూర్చుంటాము. స్టేజిమీద తెరవేసి వుంటుంది. లోపల మద్దెల మ్రోగుతూ వుంటుంది. తాళాల శబ్దము, గజ్జెల చప్పుడు, పాట వినిపిస్తుంది. గోడమీది గడియారం సరిగ్గా ఆరుగంటలు కొడుతుంది.

తెర రెండుగా విడిపోతుంది. స్టేజి మధ్యలో ఒక అమ్మాయి నిలబడి వుంది. తెల్లని చీరె కట్టుకుంది. వంటినిండా ధగధగ మెరిసే రాళ్ళ నగలు వేసుకుంది. కదలక మెదలక వూపిరిగూడా పీల్చకుండా అలాగే నిలబడివుంది. ఒక నిమిషము గడుస్తుంది. 'ఆలయంలోని విగ్రహమా' అని మనం ఆశ్చర్య పోతాము. అంతలో మృదంగం మ్రోగుతుంది. వీణ చక్కగా పలుకుతుంది. 'ఖణ్' మని తాళము ధ్వనిస్తుంది. ఆ సంగీతంలో గొంతు కలిపి ఒక స్త్రీ 'తాంతై, తాంతై' అని పాడుతుంది. నాట్యం నేర్పిన గురువు తన చేతిలోతాళాలు పట్టుకుని రకరకాలుగా వాటిని తట్టుతూ ధ్వనులు చేస్తాడు. అప్పుడు ఆ విగ్రహం లోకి ప్రాణం వస్తుంది. నేత్రాలు ఆ ప్రక్కకి, ఈ ప్రక్కకి, పైకి, క్రిందకి, గుండ్రముగా కదిలిస్తుంది. చల్లగా నవ్వుతుంది. తరువాత తలను ప్రక్కలకు ఆడిస్తుంది. 'తాంతై-తాంతై; తకతై-తాంతై' పాటను పాడుతున్నా నిలపకుండా అలాగ పాడుతూనే వుంది. నాట్యంచేసే అమ్మాయి చేతులను రకరకాలుగా కదిలిస్తుంది. అటుపై తన కాళ్ళ గజ్జెలు 'ఝణ ఝణ' మని పలికే లాగున భూమిమీద కాళ్ళను తట్టుతూ, ముందుకు నడుస్తూ, వెనక్కి అడుగులువేస్తూ, ప్రక్కలకు వయ్యారంగా వెళ్ళుతూ, గుండ్రంగా తిరుగుతూ, గాలిలో యెగురుతూ, ఒక్కొక్కసారి తొందరగా, మరొక్కసారి మెల్లగా ఆడి ముగించి నిలబడు తుంది. ఏ మాడుతుందో, యెందుకలా ఆడుతుందో మనకు తెలియకపోయినా,



ఆ చేతులు కదిలించడం, కాళ్ళతో గజ్జెలు పలికించడం, మెడ నాడించడం, అంతా చూస్తుంటే చాలా ముచ్చటగా వుంటుంది. మనకు సంతోషం కలిగిస్తుంది. అలా ఆడడానినే నృత్త మంటారు. ఇందులో పాట లుండవు. ‘తాంథై-తకథై’ అనో లేక ‘సరిగమ-రిగమప’ అనో స్వరములతో గూడిన పాట పాడితే దానికి తగినట్లుగా కాళ్లు, చేతులు, తల, కండ్లు రకరకాలుగా కదిలిస్తూ ఆడితే నృత్త మంటారు.

# నృత్యమంటే యేమిటి?

పాటపాడే స్త్రీ

‘ సరసిజాక్షులు జలకమాడే
సమయమున నీ వచ్చుటకు జని
సరిగె చీరెలు మెల్ల జేకొని
పరుగులెత్తుట న్యాయమా ’

యిలా పాడుతూవుంది.

నాట్యంజేసే అమ్మాయి ఆ పాటలోని మాటలకు సరిపోయేలాగ, ఆ మాటల అర్థమును మనకు తెల్పడానికి, చేతులను చాచుతూ, ముడుస్తూ, ప్రక్కలకు, ముందుకు వ్రేళ్ళను కదిలిస్తూ, మధ్య మధ్య కాళ్ళను భూమిమీద తట్టుతూ గజ్జెలను పలికిస్తూ ఆడుతుంది. ఇలాగ ఆడుటను నృత్యం అంటాము. నృత్యములో రాముడు, కృష్ణుడు మొదలైన దేవుళ్ళను పొగుడుతూ పాటలుపాడతారు.

భంగిమలో భావము—‘సరసిజాక్షులు జలకమాడే’ పాటలోని భంగిమ.

ఎక్కువ మంది స్త్రీలు ఒకచోట గూడి స్నానం చేస్తూ వుంటారు. అప్పుడు వారు హాస్యానికి ఒకరిపై ఒకరు నీళ్లు జల్లుకుంటారు. ఈమె, తన కుడిచేతితో మరొక భామినిపై నీళ్ళు జల్లి, తిరిగి ఆమె జల్లిన నీరు తన ముఖంపై పడకుండా ఎడమచేయి ముఖానికి అడ్డుగా పెట్టింది.

# నాట్యము

తరువాత పది పదిహేనుమంది అమ్మాయిలూ, అబ్బాయిలూ కలిసి, రామాయణము నాటకము వేస్తారు. ఇందులో వేసే వారందరూ, రాముడు, సీత, లక్ష్మణుడు మొదలైనవారిలా ధగధగ మెరిసే చమ్కీ దుస్తులు కట్టుకొని, బంగారు కిరీటాలు పెట్టుకొని, ముత్యాలహారాలు వేసికొని స్టేజిమీదకు వచ్చి-చక్కగా పాడతారు. మాట్లాడతారు. ఆ పాడే పాటలకు అర్థము మనకు తెలిసే విధంగా చేతులను కదిలిస్తారు. చేతుల వ్రేళ్ళతో సంజ్ఞలు చేస్తారు. వీటినే ముద్ర లంటాము. కాళ్ళతో గజ్జెలు పలికిస్తారు. ఇలా ఆడుతూ, పాడుతూ ఒక కథను యెక్కువమంది ప్రదర్శించడం నాట్య మంటాము. అంతలో గడియారం తొమ్మిది కొడుతుంది. ఆట ముగుస్తుంది. మనంయింటికి వస్తాము. ఇప్పుడు తెలిసిందిగదూ - నృత్తము, నృత్యము, నాట్యము అంటేయేమిటో—

మళ్ళీ యింకొకసారి చెప్తాను. జాగ్రత్తగా జ్ఞాపకముంచుకోండి—

'తాం-తై, తక-తై', 'సరిగమ-రిగమప' అనే శబ్దాలు పాడుతూవుంటే వాటికి తగినట్లుగా కాళ్లూ చేతులూ కదిలిస్తూ ఆడడం నృత్తము.

రాముడు, కృష్ణుడు మొదలైన దేవతలను స్తోత్రంచేస్తూ, పాడుతూ, ఆపాట అర్థాన్ని చేతులతో చూపుతూ ఆడుట నృత్యము.

ఎక్కువమంది మనుష్యులు, రకరకాల వేషాలు వేసుకొని ఒక కథను ప్రదర్శించుట నాట్యము.

బొమ్మలోని కథ:—

ఈ బొమ్మ రామాయణ కథలోనిది. దశరథుని ఆజ్ఞ చెల్లించుటకు సీతా, లక్ష్మణులతో కలిసి శ్రీరాముడు 14 సం॥లు అరణ్యములో గడిపాడు. ఆ కాలంలో మారీచుడు అనువాడు అందమైన బంగారులేడి రూపములో వారుండే స్థలానికి వచ్చి సీతాదేవికి కనబడేటట్టు తిరుగుతాడు. ఆమె ఆ లేడిని చూచి తనకు కావాలని కోరుతు (అదే యీ భంగిమ) రాముడు, తరువాత లక్ష్మణుడు ఆ లేడి కొరకు వెళ్ళగా, ఒంటరిగా నున్న సీతమ్మను లంకాధీశుడు రావణుడు యెత్తు కొనిపోయి చెఱలో పెట్టాడు. రాముడు యుద్ధంలో రావణుని సంహరించి, సీతతో అయోధ్య చేరి, సుఖంగా రాజ్యపాలనం చేస్తాడు.

# కూచిపూడి భాగవతము

కూచిపూడి ఆంధ్రదేశంలో చాలా పేరున్న అగ్రహారము. కొన్ని వందల సంవత్సరములనుండి ఈ వూరిలోని బ్రాహ్మణులు (పురుషులుమాత్రమే) నృత్యం జేస్తూవున్నారు. వీరు వూరూరా, వాడవాడా తిరుగుతూ రామాయణము, మహాభారతము మొదలైన కథల్ని పల్లెల్లో వుండే చదువురానివారికిగూడా అర్ధమయ్యే లాగున పాడుతూ, ఆడుతారు. వీరెప్పుడూ భగవంతుని కథలనే నృత్యమాడుతూ జీవితాలను గడిపేవారు. గనుకనే వీరికి భాగవతులని పేరు వచ్చింది. హిందువులకు ముఖ్యమైన పురాణములు మూడు-రామాయణము, మహాభారతము, భాగవతము. శ్రీరాముని జీవిత చరిత్ర రామాయణము. మహాభారతం కౌరవులు, పాండవుల కథను తెల్పుతుంది. శ్రీకృష్ణ చరిత్రము, భాగవతము. ప్రపంచంలో దుర్మార్గుల శిక్షించి వారిని రక్షించుటకు మహావిష్ణువు పది అవతారములనుయెత్తాడు. అవే మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశురామ, రామ, కృష్ణ, బుద్ధ, కల్క్యావతారములు. అందులోని యెనిమిదవ అవతారమే కృష్ణావతారము. కృష్ణ జీవితగాథకు సంబంధించిన గ్రంథమే భాగవతము. ఆ కథనే యెప్పుడూ గానంజేస్తూ, నాట్యమాడుతారు. గనుక వీరికి భాగవతులని పేరు వచ్చింది. వీరు ఈ నాటకాలు వీధుల్లో ఆడుతారు. అందువల్ల ఈ నాటకాలకి వీధి భాగవతాలనీ, వీరిని వీధి భాగవతులని గూడా పిలుస్తారు.

ఇలాంటి నాటకాలు వేసేవారు తమిళదేశంలోనూ, మలబారులోనూ, అస్సాంలోనూ, వంగదేశంలోనూ, వుత్తరదేశంలోనూ, ఒరిస్సాలోనూ గూడా వున్నారు.

వీరు నాట్యమాడుతారు. నాట్యమంటే యేమిటో చెప్పానుగదూ!

యోగి సిద్ధేంద్రులవారు కూచిపూడివారికి నాట్యం నేర్పిన పూజ్య గురువులు.

# భరతనాట్యము

దేవాలయాల్లో దేవదాసీలు దేవునిముందు నాట్యం చేస్తారని చెప్పానుగదూ. వారే దేవుని ఊరేగింపుల్లో గూడా స్వామివెంట వెళ్ళి నృత్యం జేస్తారు. రాజుల దర్బారుల్లో, గొప్ప ధనవంతుల యిండ్లలో పెండ్లి మొదలైన శుభసమయాల్లో నాట్య మాడతారు. గుడిలో భగవంతునిమీద భక్తి గీతాలు పాడతారు. సభల్లో అక్కడ కూడినవారిని సంతోషపెట్టడానికి అనేక రకాల పాటలుపాడి నాట్యం చేస్తారు. ఆ నాట్యానికే 'భరతనాట్య'మనీ 'కేశిక' అనీపేర్లు. ఈనాట్యం ప్రత్యే కంగా స్త్రీలు మాత్రమే చేస్తారు. పురుషులు తాళంవేస్తూ, వాయిద్యాలు వాయిస్తూ సహాయపడతారు (ఈనాట్యం భారతదేశంలోని అన్ని నాట్యాలలోనూ చాలా గొప్ప దని పండితుల అభిప్రాయం) ఈ నాట్యాన్ని మనదేశంలోని యితర ప్రాంతా ల్లోనివారేగాక ఇంగ్లండు, రష్యా, అమెరికా మొదలైన దేశాలవారుగూడా వచ్చి నేర్చుకుంటున్నారు. ఈనాట్యం ఆంధ్రదేశంలోనూ, తమిళదేశంలోనూ యెక్కు వగా వ్యాపించివుంది. మరొక విశేష మేమిటంటే ఈనాట్యం బాగా చేయాలంటే తెలుగుభాష రావాలి. ఇందులోపాడే పాటలన్నీచాలావరకు తెలుగులోవుంటాయి.

ఈ నాట్యంలో సాధారణంగా ఒక నర్తకిమాత్రమే పాల్గొంటుంది.

ఈ ప్రదర్శనంలో అలరింపు, జతిస్వరం, శబ్దం, వర్ణం, పదం, తిల్లాన మొదలైనవి ఆడుతారు.

'అలరింపు' తో మొదలు పెట్టారు. ఇది ప్రార్థన నృత్యంగా చెప్ప వచ్చును.

జతిస్వరం, తిల్లాన ఈ రెండింటిలో 'స రి గ మ - గ మ పా' మొదలైన స్వరాలు, 'తా జం - త క జం' మొదలైన మృదంగ శబ్దాలకు తగినట్లుగా నృత్త మాడుతారు. (నృత్తమంటే యిదివరకే వ్రాశాను. తెలుసుమగదూ.)

# శబ్దము

ఇందులో రాముడు, కృష్ణుడు మొదలైన దేవుళ్ళను పొగిడే పాటలతో నృత్యమాడుతారు. (నృత్యమంటే గూడా యేమిటో యిదివరకే తెల్పాను.)

పదవర్ణము :—

ఇందులో నృత్తము, నృత్యము రెండూ చేస్తారు. పదము - పదాలకు అభినయం జేస్తారు.

(అభినయమంటే దుఃఖాన్ని, సంతోషాన్ని, కోపాన్ని, భయాన్ని, ఆకలిని, నిద్రను ఇలాంటివాటిని ముఖంలో చూపడం అభినయ మంటారు.)

# యక్షగానము

ఆంధ్రదేశములో యక్షులనే ఒక ప్రత్యేక తెగవారున్నారు. వారినే జక్కులవారనిగూడా పిలుస్తారు. వీరు సంగీతము పాడుతారు, నాట్యము చేస్తారు. వీరి నాట్యానికి యక్షగానమని, జక్కుల భాగవతమని పేరు. వీరువేసే నాటకాల్లో ఆడవారుగూడా పాల్గొంటారు. వీరుగూడా వీధి భాగవతులవలె రామాయణము, మహాభారత కథల్ని, వూరూరా తిరుగుతూ పల్లెల్లో, పట్టణాల్లో, ప్రదర్శనలిస్తారు. వీరి నాట్యము యెంతగొప్పదంటే పెద్దపెద్ద రాజాస్థానములచే ఆహ్వానింపబడి వీరు దర్బారుల్లో ప్రదర్శనా లిచ్చేవారు. రాజులుగూడా యక్షగానములు అనేకం వ్రాశారు.

కన్నడ దేశములో వేసే నాటకాలకు గూడా యక్షగానములని పేరు.

# కథక్ నృత్యము

మనదేశాన్ని పాలించిన మహమ్మదీయ ప్రభువులు మనకు మూడు వెల లేని రత్నాలు అర్పించారు.

(1) తాజ్ మహల్ (2) హిందూస్థానీ సంగీతము (3) కథక్ నృత్యము.

తాజ్‌మహల్ — పాలరాతితో నిర్మించబడిన చాలా గొప్ప కట్టడం. షాజహాన్ యీ అపూర్వకట్టడం తనభార్య సమాధిపై నిర్మించాడు. దీనికి కొన్ని కోట్ల రూపాయలు ఖర్చుపెట్టాడు

హిందూస్థానీ సంగీతము— మహమ్మదీయులు మనదేశం రాక పూర్వం భారతదేశమంతటా సంగీతం ఒకేమాదిరిగా వుండేది. తురుష్కులు ఢిల్లీని ముఖ్యపట్టణంగా జేసుకొని మనదేశాన్ని పాలించిన కాలంలో ఆ పాదుషాల దర్బారుల్లో ప్రస్తుతం ఉత్తరదేశంలో పాడే సంగీతం క్రమేణా పెరిగి దక్షిణాది సంగీతంనుండి వేరుబడి రూపొందినది.

కథక్ నృత్యము. ఈ నృత్యముగూడా నవాబుల దర్బారులలో వారి వినోదార్థం పెరిగింది. ఈ పద్ధతి నాట్యం పూర్తిగా ఉత్తరదేశం, పంజాబు, రాజపుతాన, బొంబాయి మొదలైన ప్రాంతాల్లో ప్రచారంలో వుంది. ఈనాట్యం తెలిసిన గొప్ప విద్వాంసులు లక్నోలో వుంటారు. ఆదిలో ఈ నాట్యాన్ని ప్రచారం చేసినవారు హరిదాస యోగులవారు.

'కథక్'లో నృత్యము చాలా గొప్పగా వుంటుంది. వీరు గంటలకొలది, నోటితో (నృత్తములో) పలికే శబ్దాలు చెప్పుతూ నృత్త మాడుతారు. కొన్ని సమయాల్లో పదునైన కత్తులమీద నిలబడి నాట్యం జేస్తారు. ఒక్కొక్కప్పుడు నాట్యమాడే స్థలంలో రంగురంగుల ముగ్గు పరుస్తారు. నర్తకులు దానిమీద నాట్యం చేస్తూ కాళ్ళ- వివిధ విధములైన బొమ్మలు చిత్రిస్తారు. వీరు తొందర తొందరగా, గిరగి తిరుగుతూ నృత్యం చేస్తుంటే, మనుష్యులుగూడా కనబడరు. భూమి మీద వారి —లు కనిపించవు. వారు గాలిలో నాట్యం చేస్తున్నట్లుంటుంది.

# అంకియానట్

మనము అస్సాము వెళ్ళితే, అక్కడ దేవాలయాల్లో నర్తకులు దేవుడ్ని నృత్యము, సంగీతముతో పూజచేయడం చూస్తాము. ప్రతి ఆలయాన్ని ఆనుకొని ఒక నృత్యమందిరం వుంటుంది. అక్కడ భక్తులందరూ చేరి శ్రీకృష్ణుని జీవిత గాథలను పాడుతూ, నాట్యం జేస్తారు; అస్సాములో ప్రచారంలోనున్న నాట్యమే 'అంకియానట్' ఈ నాట్యాన్ని, సుమారు ఐదువందల సంవత్సరాల క్రిందట అస్సాం నివాసి, గొప్ప వైష్ణవాచార్యుడు శ్రీ శంకరదేవ ప్రచారంలోకి తెచ్చారు. వీరు ఉత్తర దక్షిణ దేశాలలో అనేక సంవత్సరాలు తిరిగి ఆయా ప్రాంతాల్లోని నృత్యసంగీతాలను తెలిసికొని అస్సాములో నృత్యపూజకు అనుకూలమైనట్టి సాంప్రదాయసిద్ధ నాట్యపద్ధతిని రూపొందించారు. వారే అనేక నాటకాలు వ్రాశారు. భక్తులకు నేర్పి నాట్యమాడించారు. అంతేగాకుండా తన తర్వాత తన పీఠానికి వచ్చే ప్రతి ఆచార్యుడు కనీసం ఒక నాటకాన్నైనా వ్రాస్తేగాని, ఆచార్య పీఠానికి అర్హుడు గాడని శాసించాడు. ఇలా వారు ఆదేశంలోని నాట్య కళాభివృద్ధికి యెంతో సేవ జేశారు. ఆంధ్రదేశంలో సిద్దేంద్రయోగివారు వ్రాసినట్టి 'పారిజాత' కథనే వారు గూడా నాటకముగా వ్రాశారు. ఈదేశంలోని శాస్త్రీయ నృత్యముగూడా మన దేశములోని కళని చాలా వరకూ పోలి వుంటుంది.

# ఒడిస్సీ నృత్యము

ఒరిస్సా దేశంలో ప్రచారంలోనున్న పురాతన నృత్యానికి 'ఒడిస్సీ' అని పేరు. ఈ నృత్యము ఆలయాల్లో దేవదాసీలు చేస్తారు. సభల్లోగూడా నర్తకినులు నాట్యమాడుతారు. ప్రఖ్యాత జగన్నాథస్వామి ఆలయం (పూరి జగన్నాథుడు) ఒరిస్సాలో వుంది. ఆ ఆలయం నాట్య, సంగీతాలకు నిలయం. కొన్ని వందల మంది దేవదాసీలు ఆ స్వామి కొలువులో వున్నారు. వారు జగన్నాథుని నృత్య, సంగీతములతో ఆరాధిస్తారు.

ఒరిస్సాదేశం ఆంధ్రదేశాన్ని అనుకొని వుంది. గనుక ఈరెండు దేశాల్లోని నృత్యకళ చాలావరకు పోలి వుంటుంది. సంగీతం ఉత్తరాది వారి పద్ధతిని పోలి వుంటుంది. 'దక్కిని' అనే నాట్యము ఆంధ్రదేశానికి ప్రక్కనే వున్న ప్రాంతాల్లో వుంది. ఈ నాట్యాలు గాక మన దేశములో లాగ భాగవతాలు గూడా ఆడుతారు. వాటికే 'సొక్కినాట' అనిపేరు. అందులో పురుషులు మాత్రం పాల్గొంటారు.

# మణిపురనృత్యము

మణిపురము, వంగదేశములలో ప్రచారములోనున్న నాట్యానికి మణిపుర నృత్యమని పేరు. మణిపుర సంస్థానాధిపతులు ఈ పద్దతి నృత్యాన్ని పోషించి, వృద్ధిలోనికి తెచ్చారు. ఈ దేశంలో గూడా శాస్త్రీయ నృత్య కళను అర్జునుడే ప్రవేశ పెట్టాడు. చిత్రాంగద అనే రాజ కన్యకు అర్జునుడు భరత శాస్త్రము నేర్పాడు. ఆమె ద్వారా నృత్యకళ మణిపుర ప్రాంతంలో ప్రచారంలోకి వచ్చిందని పెద్దల అభిప్రాయం.

వంగదేశము చైతన్యమహాప్రభువు యొక్క జన్మ భూమి. ఆయన గొప్ప వైష్ణవ భక్తుడు. శ్రీకృష్ణుని లీలలు పాడుతూ భక్తితో నృత్యము జేసేవాడు. ఆయన భక్తిమార్గం ఆదేశం వారందరిని ఆకర్షించింది. అందరూ దేవునిసంగీత నాట్యాలతో పూజచేయుట అవలంబించారు. ఈ దేశాలకు చెందినవారే జయదేవుడను మరొక గొప్ప భక్తుడు. ఈతడు కృష్ణ భక్తుడేగాక గొప్ప కవి. సంస్కృతంలో రాధా కృష్ణులను గూర్చి చక్కని పాటలు వ్రాశారు. ఆపాటలకు అష్టపదులని పేరు. ఈ ప్రాంతపు ప్రజలు అష్టపదులను పాడుతూ భక్తితో దేవాలయాల్లో నృత్యం జేస్తారు.

వీరి నాట్యంలో కాళ్ల చేతుల కదలికలు చాలా సున్నితంగా వుండి చూడ్డానికి యెంతో హాయిగా వుంటుంది. ఈ నాట్యంలో 'ఖోల్' అనే వాయిద్యం వాయిస్తారు. పురుషులందరూ ఖోల్ వాయిద్యాలు వాయిస్తూ వుంటే, స్త్రీలు అద్దాలు కుట్టిన రంగు రంగుల దుస్తులు ధరించి తన్మయత్వంలో నృత్యం చేస్తూవుంటే యెంతో ఆనందంగా వుంటుంది. మన శరీరాన్ని మఱచి మనకు కూడా నాట్యమాడాలని బుద్ధి పుడుతుంది. దేవుడు ప్రత్యక్షమైనట్టే అనిపిస్తుంది. వీరు చేసే నృత్యాల్లో 'రాసలీల' ముఖ్యమైంది. ఇది రాధాకృష్ణుల పవిత్ర ప్రేమను తెల్పే నృత్యము.

# కథకళి

మలయాళీల నృత్యానికి 'కథకళి' అనిపేరు. ఆంధ్రలో కూచిపూడివారి వలే 'కథకళి' నాట్యాన్ని నంబూద్రి బ్రాహ్మణులు వృద్ధిలోనికి తెచ్చారు. కథకళి గూడా కూచిపూడివలే నాటకమే అయినా రెండింటిలో ఒక ముఖ్యమైన భేద ముంది. కూచిపూడివారు నాట్యం చేస్తూ పాడతారు. కథకళినర్తకులు పాటలు పాడరు. మాట్లాడరు. రాక్షసులు మొదలైన దుష్టపాత్రలు మాత్రం అప్పుడప్పుడు చూచే వారికి భయం కల్గేలాగున కేకలు పెట్తారు. కళనర్తకులు వారికి వెనుక నిలబడి పాడేవారి పాటకు తగినట్టుగా, పాటలోని అర్థం చూచేవారికీ తెలిసే విధంగా ఆడతారు.

భయం కల్గించే దృశ్యాలు, యుద్ధము మొదలైన ఉత్సాహం కల్గించే దృశ్యాలు వేయడంలో వీరు చాలా పేరు పొందారు. వీరు నాట్యం చేసేటప్పుడు ముఖాన్ని రకరకాల రంగులతో అలంకరణ చేసురుంటారు. అది చూడ్డానికి వింతగా, అందంగా ఉంటుంది. రావణాసురుడు మొదలైన రాక్షసపాత్రలు వేసు కొనే రంగులు మరీ భయంకరంగా వుండి, వారు చేసే నృత్యము, అప్పుడు వాయించే వాయిద్యాలు, నిజంగా మనకు హడలు పుట్టిస్తాయి. ఇంకొక ముఖ్య మైన విషయం.

పూర్వకాలంలో మలయాళదేశాన్ని ప్రమీల అనే రాణి పాలించింది. ఆమెను అర్జునుడు వివాహం చేసుకున్నాడు. అర్జునుడు గొప్ప నాట్యకళావేత్తగా యిదివరకే చెప్పాను గదూ! అందువల్ల ఆ కాలంనుండీ మలయాళ దేశంలో చక్కని నాట్యం వృద్ధిచెంది వ్యాపించిందని పెద్దల అభిప్రాయం.

# సిరైకేళా నాట్యము

సిరైకేళా సంస్థానం బీహారు రాష్ట్రంలో వుంది. ఈ సంస్థానాధీశులు ఆరాధించే నాట్యానికి "చౌ" నృత్యమని పేరు.

'సిరైకేళా' లో వృద్ధిజెందిన నాట్యం గాన దీనిని సిరైకేళా నృత్యమని గూడా పిలుస్తారు. "చౌ" నృత్యము చూడ్డానికి చాలా వింతగా, ముచ్చటగా వుంటుంది.

ఈ నాట్యము చేసేటప్పుడు నర్తకులు ముఖాలకు తొడుగులు ధరిస్తారు. నాట్యంలో భావాలు చూపించే ముఖాలు తొడుగులతో కప్పబడి వుంటాయి. కనుక నర్తకులు నాట్యంలో భావాలను-కాళ్లూ, చేతులయొక్క కదలికలతో, మృదంగము మొదలైన వాయిద్యాల సహాయంతో ప్రదర్శించుతారు. ఈ నాట్యం చాలా గంభీరంగా వుంటుంది. ఇందులో స్త్రీలు పాల్గొనరు. పురుషులు మాత్రం నాట్యం చేస్తారు.

# తోలుబొమ్మల భాగవతము

'బూరెలు వండేదా పిల్లోడా
గారెలు వండేదా పిల్లోడా
గారెలు వండేదా -
తకత తకత తై-తక తక తక తక'

తెరమీద బంగారక్క బొమ్మ పాడుతూ, కాళ్ళూ చేతులూ తిప్పుతూ, 'తైయ్' అని ఆడేస్తుంది.

అంతలో తెఱ చివర దూరంగా వున్న కేతిగాడు బొమ్మ గబగబా పరుగెత్తుకొని ముందుకు వచ్చి ఒక్క మొగ్గవాలి, రెండు పల్టీలు కొట్టి నాలుగు బస్కీలు తీసి——

'బూరెలు వండితె-బురబురమంటయి
గారెలు వండితె-గరగర మంటయి
అరిసెలు వండత్తో-ఓ యత్తమ్మా
అరిసెలు వండత్తో-
దింతక దింతక దిగిదిగితై'

కేతిగాడు గెంతుట మొదలుపెట్టుతాడు. అక్కడ చేరినవారందరూ పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వుతారు.

ఇది తోలుబొమ్మలాటలోని ఒక హాస్యఘట్టం. మనము వేసంగి సెలవుల్లో పల్లెటూర్లకు వెళ్ళితే యిలాంటి దృశ్యాలు చాలా చూస్తాము.

తోలుబొమ్మలాట అతి పురాతనమైన విద్య. ఆంధ్రలో రెండువేల సంవత్సరాలనుండి ఈ ఆట ప్రచారంలో వుంది. ఇప్పుడు మనంచూచే సినీమాలకు యిదే మాతృకగా చెప్పవచ్చును. తెల్లని తెరగట్టి దాని వెనుక నిలబడి బొమ్మల నాడించడం చాలా పురాతనకాలంనుండి మనదేశంలో ప్రచారంలో వుంది. ఈ బొమ్మలాటవారుగూడా, భాగవతులవలె వూరూరా తిరిగి రామాయణం మహాభారతం కథల నాడుతారు.

ఆవు, జింక మొదలైన జంతువుల చర్మాలతో చేసిన బొమ్మలతో భాగవతాల నాడుతారు గాన వీరికి తోలుబొమ్మల భాగవతులని పేరు వచ్చింది.

ఈ భాగవతం చూడ్డానికి చాలా తమాషాగా వుంటుంది.

# బొమ్మలాట

తోలుబొమ్మల భాగవతము గురించి యిదివరకే చెప్పాను. తోలుబొమ్మలాట ఆంధ్రదేశములో ప్రచారములోవుంది. తోలుతో చేసిన బొమ్మలు గాక కఱ్ఱతో చేసిన బొమ్మలను తెరవెనుక మనుష్యులు నిలబడి పాడుతూ ఆడించే విద్యకూడా మనదేశంలో చాలా పూర్వకాలంనుండి వృద్ధిజెందినది, ఈ ఆటగాండ్రుగూడా రామాయణం, మహాభారతం మొదలైన పురాణ గాథలను ప్రదర్శిస్తారు వీరు ఆడించే విధముగూడా తోలుబొమ్మలాటలాగే వుంటుంది.

పాతికఏళ్ళక్రితంవరకు 'పెళ్ళాడే బొమ్మ' 'కీలుబొమ్మ' లనే పేరుతో ఈ ఆటలు మన తెలుగునాట విరివిగా ఉండేవి. ఈనాటికీ బందరువాళ్ళు కొందరు ఆడిస్తున్నారు. ఇతరదేశాల్లో ఈ ఆట చాల అభివృద్ధి చెందింది.

ప్రస్తుతకాలంలో ఈ విద్య రాజపుతాన, తమిళ, కర్నాటక దేశాల్లో విరివిగా ప్రచారంలో వుంది.

# అర్ధనారీశ్వరుడు
# పగటివేషాలు

పాపలూ—

మీరెప్పుడైనా పగటివేషాలు చూచారా? రాత్రిపూట నాటకాల్లో వేషాలు వేసినట్లే కొందరు పగలుకూడా అనేక రకాలుగా వేషాలు ధరించి, యింటింటికీ తిరుగుతూ నాట్యంచేసి, హాస్యం చెప్పి, మనలను ఆనందపరిచి, పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వించి డబ్బు సంపాదించుకుంటారు. వారినేపగటివేషాలవారంటారు.

వీరి వేషా లన్నింటిలో అర్ధనారీశ్వరుడు చాలా ముఖ్యమైంది. చాలా గొప్పది. శరీరంలో ఎడమ భాగము పార్వతిగాను, కుడివైపు భాగము శివునిగాను అలంకరించుకొని రెంటికి మధ్య తెరగట్టి-పార్వతిని అభినయించేటప్పుడు శివుని భాగం తెలతో కప్పివుంచి ఆడుతాడు. శివుని నాట్యం చేయాలనుకున్నప్పుడు మనకు తెలుసుకోలేనంత త్వరగా తెరమార్చి నాట్యం చేస్తాడు. ఇలా ఆడవారు చేసే లాస్యము, పురుషులుచేసే తాండవము, వెంటవెంటనే చేసి మనలను ఆనందపరుస్తాడు. అతడు యెంత గొప్ప నర్తకుడో ఊహించండి.

ఈ పగటి వేషాలు ఆంధ్రలో ఎక్కువగా వున్నాయి.

అర్ధనారీశ్వర నాట్యం గుజరాత్‌లోగూడా చేస్తారు.

# క్షేత్రయ్య

ఇతడు గొప్ప వైష్ణవ భక్తుడు. కూచిపూడి దగ్గరలో వున్న మువ్వ అనే గ్రామంలోపుట్టాడు. మువ్వలో గోపాలస్వామి ఆలయం వుంది. ఆ దేవుడంటే ఇతని కెంతో ప్రీతి. మువ్వ లోని గోపాలునిమీద యితడు 4000 పాటలు వ్రాశాడు. వాటినే పదాలని అంటారు. నాట్యంజేసేవారు మువ్వగోపాల పదాలని పాడుతారే అవి ఈతడు వ్రాసినవే. క్షేత్రయ్య పుణ్యక్షేత్రాలన్నీ తిరిగి అక్కడి దేవుళ్ళమీద పాటలు వ్రాసి, పాడి, నృత్య మాడుతూ తరించాడు. ఈతడు గొప్ప భక్తుడేగాక, సంగీత నాట్యాల్లో నిధి. దక్షిణదేశంలో అతని పదాలు రాని నర్తకు లుండరు.

పదములు—

ఎంత చక్కనివాడే నా సామి
యెంత చక్కనివాడే
ఇంతి మువ్వ గోపాలుడు
సంతతము నా మదికి
సంతసము గూర్చునే.'

# నారాయణతీర్థులు

ఈయనగూడా గొప్ప వైష్ణవ భక్తుడు. నృత్యము, సంగీతం బాగుగా తెలిసినవాడు. క్షేత్రయ్య తెలుగులో పదాలు వ్రాస్తే, తీర్థులవారు సంస్కృతంలో వ్రాశారు. ఆ పాటలకు తరంగములని పేరు. శ్రీకృష్ణుని బాల్యక్రీడలు మొదలు, రుక్మిణీ దేవిని పెండ్లాడేవరకు జరిగే కథను, ఈయన నాటకరూపంలో వ్రాశారు. ఈ పాటలు కృష్ణుని లీలల వర్ణనలతో గూడివుంది నృత్యమాడడానికి యెంతో బాగుంటాయి.

తరంగము—

"నీలమేఘ శరీర నిత్యానందం దేహి
బాలగోపాల కృష్ణ పాహి పాహి."
కలభ సుందర గమన
కస్తూరి శోభితానన
నళినదళయత నయన
నందనందన
మిళితగోపవధూజన
మీనాంక కోటిమోహన
దళిత సంసార బంధన
దారుణవైరి నాశన ॥

# సిద్ధేంద్రయోగి

ఈతడు కూచిపూడి భాగవతులకు నాట్యకళ నేర్పిన యోగిపుంగవుడు. వేణుగోపాల భక్తుడు. పారిజాత నాటకము వ్రాసి కూచిపూడివారికి నేర్పించి, వారు నాట్యకళను ప్రచారం చేయడానికి గోలుకొండ తానీషావద్దనుండి కూచిపూడి అగ్రహారం వారికి యిప్పించాడు. ఆంధ్రలో భాగవతకళ ఇలా అభివృద్ధి చెందడానికి ఈ యోగీంద్రులే ముఖ్యులు. ఆంధ్ర నాట్యకళారాధకు లకు ఈయన పూజ్యనీయుడు.

"భామనే సత్యభామనే
వయ్యారి సత్యభామనే ॥
ప్రేమతో శ్రీ కూచిపూడి
ధాముడైన వేణుగోపాలు
లేమలందరు జూడ జడతో
లేమరో గొట్టజాలిన॥

# జయదేవుడు

ఓఢ్రదేశానికి చెందిన గొప్ప వైష్ణవ భక్తుడు. సంస్కృతంలో రాధాకృష్ణులగూర్చి నాట్యానికి చాలా ఉపయోగపడే పాటలు వ్రాశాడు. ఈయన సంగీత నాట్యాలు చక్కగా నెరిగిన వాడు. జయదేవుని భార్య పద్మావతి. నాట్యంలో గొప్ప విద్వాంసురాలు. జయదేవుడు పాడుతూవుంటే, ఆ పాటలకు పద్మావతి నాట్యంచేసేది. ఈవిధంగా ఆ పుణ్యదంపతులు నృత్యగీతాలతో భగవంతు నారాధించి తరించారు.

అష్టపది—

"ప్రళయ పయోధి జలే
ధృత వా నసి వేదం
విహిత వహిత్ర చరిత్ర మ ఖేదం
కేశవ! ధృతమీన శరీర
జయజగదీశహరే."

# మీరాదేవి

రాజపుత్రస్థానమునకు చెందిన కృష్ణభక్తురాలు మీరాబాయి. ఈమె బాల్యంనుండీ కృష్ణుని పూజిస్తూ వుండేది. అనేకవందల పాటలు కృష్ణునిమీద వ్రాసి పాడుతూ, నృత్యంచేస్తూ భగవంతుని పూజించేది. ఈ పాటలను 'మీరా భజనలు' అంటారు. ఈమె రాజవంశానికి చెందినా రాజ్యాన్ని, రాజభోగాల్ని అన్నింటిని త్యాగంజేసి జీవితం కృష్ణసేవలో గడిపిన మహాభక్తురాలు.

భజన—

"పగ గుంగురు బాంధుకరునాచిరే
మీరా నాచిరే
లోగ్ కహే మీరా ఓయి బావరే
బాపు కహే కులనాశిరే॥"

# హరిదాసయోగి

హిందూస్థాన్ పద్ధతి (కథక్) నృత్యకళకు మూలపురుషుడు ఈ మహానుభావుడు. ఈతడు గొప్ప యోగీశ్వరుడు. మహమ్మదీయ పరిపాలనలో మన నృత్యకళ నశించకుండా వుండుటకు ఆ కళకు ఒక నూతన స్వరూపమిచ్చి అభివృద్ధి పరిచాడు. తాన్‌సేను, బైజు మొదలైన ప్రఖ్యాతి పొందిన ఉత్తర హిందూస్థానపు గాయకరత్నాలు వీరియొక్క శిష్యులే. వీరు అక్బరు చక్రవర్తి కాలములో నున్నారు.

# చైతన్యమహాప్రభువు

వంగదేశానికి చెందిన యోగీశ్వరుడు. కృష్ణభక్తుడు. ఈతడు కృష్ణుని పొగడుతూ కీర్తనలు వ్రాసి భక్తులతో కలిసి పాడుతూ, నృత్యమాడేవాడు.

"రాధాబాయి శ్యామసుందర
నాచే సంగరే
ఆనంద శ్రీ చైతన్యప్రభూ
తాలీ బాజరే."

## జాయపసేనుడు

ఈతడు కాకతీయ రాజులకాలంలో సేనాపతిగా వున్నాడు. సంగీత నాట్యాలను బాగుగా తెలిసినవాడు. ఈయన 'నృత్త రత్నావళి' అనే గ్రంథము నాట్యకళపై వ్రాశాడు. అందులో ఆంధ్ర దేశంలోని యెన్నోవిధాల నాట్య సంప్రదాయాల గూర్చి వ్రాశాడు. ఈ గ్రంథాన్ననుసరించే వరంగల్లుకు దగ్గరగానున్న పాలంపేట లోని రామప్ప గుళ్ళలోని నృత్య భంగిమలు చెక్కారని పెద్దలు అంటారు.

# ప్రతాపరుద్రుడు

ఓరుగల్లును రాజధానిగా ఆంధ్రదేశం ఏలిన చక్రవర్తి. ఈయనకు సంగీతము, నాట్యము, శిల్పము అంటే యెంతో ప్రీతి. వీరి కాలంలో యెన్నో సుందరమైన ఆలయాలు కట్టించారు! వీరి దర్బారులో మాచల్‌దేవి అనే గొప్ప నర్తకి వుండేది. ఆమె రాజ దర్బారులో శివగీతాలు పాడుతూ నాట్యంజేసేది. మఱియు ఆమె జీవితగాథనే రసవంతమైన ఘట్టాలతో గూడిన యక్షగానంగా రచింపజేసి ప్రదర్శింపచేసి, ఆనందించేదట.

ప్రతాపరుద్ర మహారాజు కాలంలో గొప్ప అలంకార గ్రంథమును విద్యానాథుడు అనే కవిశేఖరుడు వ్రాశాడు. ఈ గ్రంథము పేరు 'ప్రతాప రుద్రీయము.' ఇది సంస్కృతములో వ్రాయబడినది. ఇది చాలా గొప్ప గ్రంథము. 'ప్రతాప రుద్రీయా'న్ని మించిన అలంకార శాస్త్రం మరొకటి ప్రపంచంలో లేదు. కావ్యాలు చదవడానికి యింపుగా, వినడానికి సొంపుగా, తేనె లొలుకునట్లు చక్కని భావా లుట్టిపడేటట్లు వ్రాసే విధానాలను గూర్చి తెల్పే గ్రంథము, అలంకార శాస్త్రము.

# కృష్ణదేవరాయలు

ఈయన సంగీత నాట్యాలను ఆరాధించిన ప్రభువు. వీరి రాజమహల్‌లో నృత్యభంగిమలన్నీ చెక్కివున్నట్టి ఒక ప్రత్యేక నర్తన గృహం వుండేది. అక్కడ రాణీవాసంవారు నాట్యమభ్యసించేవారు. వారు అభ్యసించే విద్యలో యేమైన లోటుపాటు లుండిన, ఆ శిల్ప భంగిమలను జూచి సరిదిద్దుకొనేవారు.

వీరి కాలంలో ప్రతి సంవత్సరము వసంతోత్సవాలు చేసే వారు. అప్పుడు తమ ఆస్థానములోనే గాక తమ సామంతుల దర్బారుల్లోని నాట్యాచార్యులను, నర్తకులను, సంగీత విద్వాంసు లను, కవులను, పండితులను ఆహ్వానించేవారు. వారి విద్యలను పరీక్షించి, వారిని సత్కరించేవారు. ఈవిధంగా కళలను ప్రోత్స హించారు.

విద్వత్సభారంజక రజకం శ్రీ రంగరాజు అనే గొప్ప విద్వాంసుని కుమార్తె 'కుప్పాయి' ఆస్థాన నర్తకీమణిగా నాట్యం చేసింది. ఈమె చాలా గొప్ప విద్వాంసురాలు.

# కొమరగిరిప్రభువు

కొండవీటిని రాజధానిగా ఆంధ్రదేశాన్ని పాలించిన రెడ్డి రాజులుగూడా గొప్ప నాట్యకళాపోషకులు. కొమరగిరి ప్రభువు నాట్యకళను పోషించుటేగాక 'వసంతరాజీయ' మనే గొప్ప నాట్య గ్రంథాన్ని వ్రాశాడు. లకుమాదేవి అనే ప్రఖ్యాత నర్తకి ఆయన దర్బారులో వుండేది.

'వసంత రాజీయము'లో ఆకాలంలో నున్న ఆంధ్ర దేశంలోని అనేక రకాలైన నాట్యములగూర్చి చక్కగా వ్రాశారు.

వీరి బావమరిది పెదకోమటి ప్రభువు కాళిదాసు నాటకాలను రంగస్థలానికిపనికి వచ్చేవిధంగా సంక్షిప్తపరిచి, లకుమాదేవిచే ప్రదర్శింపజేసేవారు.

# విజయరాఘవుడు

విజయరాఘవ నాయకుడు తంజావూరు నేలిన ఆంధ్ర రాజుల్లో ముఖ్యుడు. ఈయన నేటికాలంలో ప్రచారంలోనున్న భరతనాట్యమును, యక్షగానములను యెంతో వృద్ధిలోనికి తెచ్చారు. స్వయంగా యెన్నో యక్షగానములు వ్రాశారు. ఈతని దర్బారులో రంగాజమ్మ అనే మహాపండితురాలు వుండేది. ఆమె సంగీతము, నాట్యము తెలిసిన కవయిత్రి. ఆమె కూడా యెన్నో యక్షగానములు వ్రాసింది.

వేలాదిగా నాట్యంలో అభినయానికి ఉపయోగపడే పదములు వ్రాసిన క్షేత్రయ్య వీరి ఆస్థానానికి వెళ్లి తమ పదములు పాడి రాజుగారికి, అచ్చటి పండితులకు వినిపించి వారిచే అనేక విధములుగా సన్మానాలను పొందారు. ఆనాటినుంచి దక్షిణదేశంలో క్షేత్రయ్య పదాలు యెక్కువగా ప్రచారంలోకి వచ్చాయి. నాట్యం జేసే ప్రతి ఒక్కరూ ఈ పదాలను అభ్యాసంజేసి అభినయిస్తారు. విజయరాఘవుని తండ్రియైన రఘునాథనాయకుడు కూడా గొప్ప కళాపోషకుడు, వీరుడు, సాహిత్యవేత్త. ఇతని ఆస్థానంలో చాలా గొప్ప నర్తకీమణి 'ముద్దు చంద్రరేఖ' వుండేది.

## కుంభరాణా

కుంభరాణా మేవాడు సంస్థానానికి రాజు. మీరాదేవి గొప్ప కృష్ణ భక్తురాలని యిదివరకే చెప్పాను. ఆమె భర్త కుంభరాణా. ఇతడు సంగీతము, నృత్యములను చక్కగా నెఱిగిన పండితుడు. విద్వాంసుడు, రచయిత. 'సంగీతరాజ' అను గొప్ప గ్రంథము వ్రాశాడు. జయదేవమహాకవి వ్రాసిన అష్టపదులను గూర్చి అనేక వివరములతో 'రసికప్రియ' అను పేరుతో వ్యాఖ్యానం వ్రాశాడు. జయదేవుని పాటలు నాట్యం జేసేవారికి కుంభరాణా వ్రాసిన వివరణ యెంతగానో ఉపయోగ పడుతుంది.

# అమీర్ కుస్రూ

ఉత్తరదేశ సంగీత కళను రూపొందించిన వారిలో ముఖ్యుడు అమీర్‌కుస్రూ. అతడు ఆ సంగీతానికి ఒక నూతన రూపమిచ్చినాడు. సితార, తబలా మొదలైన వాయిద్యాలు చాలా వరకు వారి కాలంలోనే కనిపెట్ట బడినవి.

ఇతడు 'తరాన' అను ఒక నూతన సంగీత రచన సృష్టించినాడు. ఈ పాటకు సాహిత్యముండదు. 'నాదిర్, దిర్ దిర్'-'తొందిర్, దిర్‌దిర్'-'దిత్తరాన, తరాన' మొదలైన అక్షరాలతో గూడిన పాటలు 'తరాన'లు. ఈ నూతన రచనలనే, దక్షిణ దేశ సంగీత రచయితలు ఆధారంగా చేసుకొని 'తిల్లాన'లు వ్రాశారు. తిల్లాన భరత నాట్యంలో చాల ముఖ్యమైన సంగీత రచన. దీనికి నృత్తమాడుతారు. ఈ రచనలో తాళము, లయ యెక్కువగా ప్రాముఖ్యత గల్గివుంటుంది. ఈ నూతన సంగీత రచనకు సృష్టికర్త అమీర్‌కుస్రూ.

# సూరదాసు

ఉత్తరదేశానికి చెందిన ఈతడు గూడా గొప్ప విష్ణు భక్తుడు. ఇతడు కృష్ణదేవుని జూచిన తన నేత్రాలతో ప్రపంచాన్ని చూడ నొల్లక, కనుగ్రుడ్లను పెరికివేసి అంధుడై, అనేక వందల కీర్తనలు రచించి కృష్ణుని కీర్తిస్తూ పాడుతూ జీవితమంతా గడిపాడు. మరొక తమాషా జూచారా——

ఇతర భక్తులు కృష్ణుని పొగుడుతూ, పాడుతూ, నృత్యం జేస్తే ఈ అంధభక్తుడు భక్తితో పాడుతుంటే శ్రీకృష్ణుడే స్వర్గమునుండి దిగివచ్చి అతనిముందు తన కాళ్ల బంగారు మువ్వలు 'ఘల్లు ఘల్లు' మని ధ్వనింపజేస్తూ నాట్యమాడి, భక్తుల్ని సంతోష పెట్టేవాడట !

'హాతోంసే హాతేలిబాజే
పైరోంసే కదమకీ జయ్యా
సూరదాస సంగీత లిఖే జబు
భాజత మృదంగ్ తబు
నాచత కనయ్యా కనయ్యా
కనయ్యా కనయ్యా ! కనయ్యా కనయ్యా॥'

# షాజహాన్

మనదేశాన్ని పాలించిన మొగల్ పాదుషాలు - బాబరు, హుమయూన్, అక్బరు, జహంగీరు, షాజహాన్, ఔరంగజేబు మొదలైన వారిలో - షాజహాన్ చక్కని భవనాలను కట్టుటలో, సంగీతము మొదలైన కళల్ని పోషించడంలో చాలా పేరు గాంచినాడు. ఇతడు చనిపోయిన తన భార్య గోరీపై కొన్ని కోట్ల రూపాయలు ఖర్చు చేసి పాలరాతితో పెద్ద కట్టడం కట్టించాడు. అదే తాజ్‌మహల్. ప్రపంచంలోని వింతల్లో ఒకటి. ఇంతేగాక యితడు సంస్కృత భాషను, కవులను, పండితులను యెందరినో పోషించాడు. మన ఆంధ్రదేశమునుండి వెళ్లిన జగన్నాథ పండితరాయలు యితని ఆస్థానములో వుండేవాడు. పండితరాయలు సంస్కృతంలో గొప్ప పండితుడు. ' "రస గంగాధరము" అనే గొప్ప గ్రంథము వ్రాశాడు. ఆ గ్రంథము నాట్యానికి, అభినయ విద్యకు చాలా వుపయోగ పడుతుంది.

తెనుగు దేశం నుండి వెళ్లిన ఒక మహా పండితుని మొగల్ పాదుషాలు గొప్పగా గౌరవించడం మనకు యెంతో గర్వ కారణం గదూ!

# స్వాతి తిరునాళ్లు

ఇతడు తిరువాన్కూరు మహారాజు. చాలా చిన్నతనంలోనే సంగీత నాట్యాల్లో చక్కని పాండిత్యం సంపాదించాడు. ఇతనికి తెనుగు, తమిళము, సంస్కృతము, మలయాళ భాషల్లో చక్కని పాండిత్యమేగాక, ఆ భాషల్లో యెన్నో పాటలు వ్రాశాడు.

ఉత్తర దక్షిణ దేశములకు జెందిన రెండు పద్ధతుల సంగీతాన్ని పోషించాడు. భారతదేశం అన్ని ప్రాంతాల నుండి యెందరో సంగీత విద్వాంసులు అతని సంస్థానానికి వచ్చేవారు. వారి సంగీతమును విని. నాట్యములను జూచి ఆ కళాకారులను తగు విధముగ సత్కరించి పంపేవాడు. నాట్యానికి వుపయోగ పడే యెన్నో రచనలు జేశాడు.

# బలిద్వీపము

తూర్పుదీవు లన్నిటిలోనూ చాలా అందమైనది బలిద్వీపము. ఇది నిజంగా ప్రపంచానికి దిగివచ్చిన స్వర్గంలా ముచ్చట గొల్పుతూ వుంటుంది. అజంతా గుహల్లోని అందమైన బొమ్మల్ని పోలిన స్త్రీలు, పురుషులు, వారు వేసుకొనే చిత్ర విచిత్రమైన దుస్తులు, నగలు, వారి నాట్యాలు, సంగీతము, వారి పూజా విధానాలు, వారి ఆచారములు అన్నీ చూస్తుంటే ఈ లోకంలో వున్నట్లు మరిచి పోయి స్వర్గంలో వున్నామనుకుంటాము. ఈ దేశములోని ఆడవారు, మగవారు, చిన్నవారు, పెద్దవారు అందరూ నాట్యం చేస్తారు. పాడతారు. దేవుణ్ణి సంగీతము, నాట్యములతో పూజ చేస్తారు.

మరొక్క ముఖ్య విషయమేమిటంటే వీరందరూ హిందువులే.

ఈ దేశ ప్రజలు గూడా రామాయణ, మహాభారత కథలను నాట్య మాడతారు మన దేశంలో లాగునే. ఈ దేశంలో దేవదాసీలున్నారు. వారు దేవుని పూజల్లో నాట్యం చేస్తారు. ఆ నాట్యానికి 'సాంగ్‌యాంగ్' అని పేరు.

చిత్రంలో భంగిమ:

దేవదాసీ నృత్య భంగిమ.

# జావాద్వీపంలో నృత్యము

జావా తూర్పు దీవులలోని ఒక సుందరమైన ద్వీపము. దీనినే పూర్వము యవ ద్వీప మనేవారు.

ఈ ద్వీపానికి కొన్ని వందల సంవత్సరాల క్రిందట భారతదేశం నుండి చాలా మంది మత ప్రచారకులు, నర్తకులు, సంగీత విద్వాంసులు, శిల్పులు వెళ్లి హిందూమతము, బౌద్ధమతము ప్రచారము చేశారు. ఆ దేశంలో అనేక గుడులు, గోపురాలు కట్టారు. అవి నేటికీ వున్నాయి. అందులో ప్రఖ్యాతి గాంచినది 'బోరోబుదూర్' దేవాలయం. అక్కడ ప్రచారంలో వున్న నాట్యం గూడా మన దేశానికి చెందినదే. నేటికీ మనదేశ పద్ధతి ననుసరించే నాట్యం చేస్తారు. రామాయణ, మహా భారత కథల్నే నాట్యమాడుతారు. మహా భారతములోని అర్జునుడు వారికి ఆదర్శ పురుషుడు.

ఈ ద్వీపంలోనివారు నేటికీ మన కళల్ని అభ్యసించి, గౌరవిస్తున్నందుకు మనం వారిని అభినందించాలి.

# సయాందేశంలోని నృత్యము

సయాం దేశాన్నే ప్రస్తుతం తాయిలాండు అని పిలుస్తున్నారు. ఈ దేశానికిగూడా మన పూర్వులు చాలా కాలం క్రిందట వెళ్లి మన మతము, కళలు, ప్రచారము జేశారు. ఈ దేశంలోని వారు హిందూ మతము, బౌద్ధమతములను రెండింటినీ అవలంబించారు. కనుక హిందూ దేవతలను, బుద్ధునిగూడా పూజిస్తారు. వీరు రామాయణము, మహాభారత కథలను నాట్యమాడుతారు. ఈ దేశంలో నాట్యకళకు, నర్తకులకు మరే దేశంలో లేనంత యెక్కువ రాజపోషణ, ఆదరణ వుంది.

చిత్రంలోని భంగిమ—

'రామాయణము' లోని ఒక నృత్య భంగిమ.

# కంబోడియా నృత్యకళ

కొన్ని వందల సంవత్సరాల క్రిందట భారతదేశంనుండి చాలా మంది కళాకారులు, నర్తకులు, నాట్యాచార్యులు, శిల్పులు, సంగీత విద్వాంసులు, మత ప్రచారకులు ఈ దేశం తరలి వెళ్లారు. శిల్పులు అనేక దేవాలయాలు, రాజ మందిరాలు నిర్మించారు. మత ప్రచారకులు మతమును బోధించారు. నర్తకులు ఆ దేశంలో నాట్యంజేసి మన నాట్యకళ యొక్క గొప్పతనం వారికి తెలియ బరిచారు. మన నాట్యం సంగీతం అభ్యసించాలనే వుత్సాహం గలవారికి మన నాట్యాచార్యులు సంగీతం, నాట్యం నేర్పారు. 'అంకోరువాట్'లోని ఆలయాలు ప్రపంచంలోకల్లా చాలా పేరు గాంచినవి. అవి మన పూర్వ శిల్పులు నిర్మించి నట్టివే. గనుకనే ఈ దేశములోని శిల్పము, సంగీతము, నృత్యము మన దేశము లోని కళలను చాలావరకు పోలివుంటవి. ఈదేశ నర్తకులు గూడా రామాయణము మహా భారత గాధలనే నాట్యమాడతారు.

ఈ దేశానికి కాంభోజ దేశమని మరియొక పేరు.

చిత్రంలోని నాట్య భంగిమ—

కిన్నెర నృత్యంలోని ఒక భంగిమ.

# సింహాళములోని నృత్యకళ

సింహాళ ద్వీపాన్నే లంక అనిగూడా పిలుస్తారు. లంకను చాలాకాలము క్రిందట రావణుడు పాలించేవాడు. అతడు గొప్ప శివ భక్తుడు. కాని మహా పతివ్రత అయిన సీతాదేవిని లంకకు యెత్తుకుని పోయి ఆమెను నిర్బంధించాడు. అప్పుడు రామునికి రావణునికి గొప్ప యుద్ధం జరిగింది. రాముడు రావణుని జంపి సీతను చెఱ విడిపించాడు. అదే రామాయణ కధ.

లంకకు మన దేశానికి చాలా పురాతన కాలం నుండీ సంబంధం వుంది. ఆ దేశంలోని నృత్యం సంగీతం మన కళలను చాలవరకు పోలి వుంటుంది,

సింహాళదేశ నృత్యానికి కండియన్ నృత్యమని పేరు. 'కండి' అనే పట్టణంలో, నాట్యకళ యెక్కువగా వృద్ధి పొందింది. గనుక ఆ పేరుతో పిలువ బడుతుంది. ఇది తాండవ పద్ధతికి జెందిన నృత్యము. ఇందులో పురుషులు మాత్రం నాట్యం జేస్తారు.

# పాటకు నృత్యము

రోజురోజుకు నీవు నాజూకు గాపెరిగి
పద్నాల్గు రోజులకు పండులాగౌతావు
అందమంతా నీదే చందమామా
చందమంతా నీదే చందమామ.


పాటను నృత్యము
రోజురోజుకు


నీవు


నాజూకుగా


పెరిగి


పద్మాల్లు


రోజులకు

మా బిడ్డ నిను జూచి (i) మారాము మానేసి
చిన్ని చేతులతోటి నిన్ను రమ్మంటుంటే
బుజ్జి చేతుల తోటి నిన్ను రమ్మంటుంటే (ii)
ఉప్పొంగి పోతావే చందమామా
ఉల్లాస పడతావే చందమామ

(i) చూచి—దీనికి రెండు విధములైన
హస్తములు పట్టపడినవి.





బిడ్డ

మా



నిను



చూచి



చూచి(2)





మారాము





మానేసి

(ii) బుజ్జి—అను మాటకు వేరుగా హస్తము పట్టబడినది.

'చేతులతోటి నిన్ను రమ్మంటుంటే' ఈ మాటలకు పైన పట్టిన హస్తములనే పట్టవలెను.





చిన్ని



చేతులతోటి



నిన్ను



రమ్మంటుటే







బుజ్జి



ఉప్పొంగిపోతావే
చందమామ



ఉల్లాసపడతావే
చందమామ

# చివరిమాట

తమ్ముళ్లూ, చెల్లాయిలూ,

మీరు ఈ పుస్తకమంతా చదివారుగదూ ఇందులో మన దేశంలోని కొన్ని నాట్య రీతులను గురించి నాట్యం చేసిన యోగులగురించీ, నాట్యాన్ని పోషించిన రాజుల గురించీ చదివారు. ఇంకా యెన్నో నాట్యానికి సంబంధించిన వివరాలున్నాయి. అవన్నీ మీరు పెద్దవారయ్యాక తెలుసుకోవచ్చును,

ఒక్క ముఖ్య విషయం చెప్పి ముగిస్తాను. మన పూర్వులు నాట్యకళను కేవలం వినోదం కొఱకేగాకుండా దేవుని పూజించడానికి, విజ్ఞానము కొఱకు వుపయోగించేవారు. కనుక కళలు చాలా పవిత్రంగా చూడబడ్డాయి. మీరు పెద్దవారయ్యాక మన దేశములోని వివిధ కళల్ని అభ్యసించి, వాటి పవిత్రతను కాపాడి, భారతదేశ కీర్తిని యితర దేశాల్లోగూడా వ్యాపింప జెయ్యాలి.